వెంకటరమణాచార్యులు, కలచవీడు

గ్రామపునర్నిర్మాణము

తాడిపత్రి, 1925

Record no. 814

Veṅkaṭaramaṇācāryulu,
Kalacavīḍu

Grāmapunarnirmāṇamu

Tāḍipatri, 1925

Record no. 814

**SUNDARAYYA VIGNANA KENDRAM**
1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

వెంకటరమణాచార్యులు, కలచవీడు.

గ్రామపునర్నిర్మాణము : అసఫ్ అలీగారి కన్‌స్ట్రక్టివ్ నాన్ కో ఆపరేషన్ అను దానికి అనువాదము / కలచవీడు వెంకటరమణాచార్యులు.- తాడిపత్రి : జానకీ ముద్రాక్షరశాల, 1925.

49 p. ;19 cm.

Record no. 814

Veṅkaṭaramaṇācāryulu, Kalacavīḍu.

Grāmapunarnirmāṇamu : Asaph Alīgāri Kanstraktiv Nān Kō Āparēṣan anu dāniki anuvādamu / Kalacavīḍu Veṅkaṭaramaṇācāryulu.- Tāḍipatri : Jānakī Mudrākṣaraśāla, 1925.

49 p. ;19 cm.

Record no. 814

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB Date filming began:

1690

శ్రీ

# గ్రామపునర్నిర్మాణము.

(అసఫ్ ఆలీగారి కన్‌స్ట్రక్టివ్ నాన్ కోఆపరేషన్

అనుదాని కనువాదము.)




అనువాదకుఁడు,

కలచవీడు వెంకటరమణాచార్యులు.

తాడిపత్రి.

టైటిల్ పేజి ప్రొద్దుటూరు

జానకీముద్రాక్షరశాలయందు

ముద్రితము. 1925

# వీరమతి

ఘూర్జరదేశ నారీమణియును, నుత్తమపతివ్రతా తిలకమనియు, బ్రఖ్యాతిగాంచి తన మానసంరక్షణమునకై యొక గంటలో 12 మందిని ఖడ్గమునకర్పించిన రాజపుత్రస్త్రీ చరిత్రము. 900 పద్యములు హృద్యములు. శైలినూతనము. మనోహరము. గ్రంథకర్త విఖ్యాత శతావధానులు బ్రహ్మశ్రీ కవిసింహా డి. రాజశేఖరముగారు. తిరుపతి వెంకటేశ్వరులలో నొకరగు బ్ర॥ శ్రీ॥ చెళ్లపిళ్ల వెంకటేశ్వరశాస్త్రి శతావధానిగారు విపులమైన యుపోద్ఘాతము వ్రాసియున్నారు. భాషాభిమానులు తప్పక చదువఁదగినది.

వెల. 1—0—0 క్యాలికో. 1—8—0

## చారుమతి.

గ్రంథకర్త:—కలచవీడు వేంకటరమణాచార్యులు.

ఇది యొక చారిత్రిక విషయముపై నాధారపడిన కల్పనకథ. శ్రీ అశోకచక్రవర్తి కొమార్తెయగు చారుమతి విషయమిందు మృదుమధురమయిన వాక్కులతో వర్ణింపఁబడినది.

వెల. 0—6—0

వలయువారు—:

జనోపకారిణీస్టోర్సు, ప్రొద్దుటూరు.

అనివ్రాయుడు.


# గ్రామపునర్నిర్మాణము.

"జాతీయతాభావము మనస్సులలో మెదలుచుండిన చాలును. విదేశీయుల తఱుమగొట్టవలయునను యత్నముల తోఁగూడిన భావముండఁబనిలేదు. విదేశీయుడు సామ్రాజ్యమును నిలుపుకొనుటకు జేయుయత్నములలో వారికి దోడ్పడుటవమానకరమని మనస్సున నాటుకొనినచాలును. ఆనాటినుండి మనసామ్రాజ్యమంతరించియుండును." జె. ఆర్. సీలీ.

"మానవులందఱు సమానముగ సృష్టింపబడియున్నారు. వారినుండి విడదీయరానిహక్కులను కొన్నిటినీశ్వరుడు వారికి బ్రసాదించియున్నాడు. వానిలో ప్రాణముభద్రముగ నుంచుకొనుట, స్వేచ్ఛావృత్తి, సౌఖ్యసంపాదన మార్గములననుసరించుట యనునవిముఖ్యములు. ఈ హక్కులను సంరక్షించుటకే ప్రభుత్వములన్నియు నేర్పడినవి. ప్రజాంగీకారము పొందుటచే న్యాయసమ్మతమైన యధికారములన్నిటిని ప్రభుత్వముపొందును. ఈయుద్దేశములకు భంగకరముగ బ్రభుత్వమెప్పుడువర్తించునో, యప్పుడాప్రభుత్వ పద్ధతిని మార్చుటకుగాని, యూ ప్రభుత్వమును బీకివేసి క్రొత్తప్రభుత్వమును స్థాపించుటకుగాని, ప్రజలకు హక్కుగలదు. తమసౌఖ్యముతమస్వత్వ సంరక్షణము భద్రముగా నుండుసూత్రములననుసరించి వానికి తగినపద్ధతినిర్మించుకొందురు." అమెరికన్ డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెండెన్స్.

"వ్యవస్థకలిగించుకొనలేని జనులు బానిసలు—" రేమండ్ పాయింకేర్.

# విజ్ఞప్తి

మహాత్మగాంధి సహాయనిరాకరణోద్యమమును లేవదీసి యించుమించుగ నైదుసంవత్సరములైనది. ఉద్యమారంభమున, స్వరాజ్య స్వాతంత్ర్యగీతికలు తన్మయతనందిపాడు భారతపుత్రికల మనోహరకంఠములనుండి వెలువడి దిశాంతములనొరసికొని ప్రతిధ్వనించినప్పుడు, దాస్యభావమును మనబాలురనాళములలోని రక్తములలో లీనమగునట్లుజేయు విద్యావిధానమునను సరించి నడుపబడుమహత్తరములగు విద్యాలయములొకటి వెంటనొకటికూలు సమయమున, వేలకువేలు యువకులు బాలురు వృద్ధులు నాయకశిఖామణులు మొదలు కాయకష్టముచేజీవించు కృషీవలునివరకు నందఱుకల్యాణ మండపములకువలెకారాగారములకు వెళ్లుసమయమున, సంపూర్ణస్వరాజ్య మానాడేసిద్ధించినట్లుండెను. కాని మహాత్మగాంధీగారి యుద్యమ మునకు రెండుముఖములున్నవి. ఒకటివినాశము. రెండవది సృష్టి. అప్పుడు వినాశమే జరుగుచువచ్చినది. కాని సృష్టిజరుగలేదు. నిర్మాణకార్యక్రమమొకనాటిలోకాని యొకసంవత్సరములో కాని ముగియదు. మనమెన్నిగంతులువేసినను, నెన్నిభుజాస్ఫాలనములగావించినను,నిర్మాణకార్యక్రమము జరుగకయుండువలని శక్తి కలుగక స్వరాజ్యమువచ్చుననుమాట బూటకము.

ఆనిర్మాణకార్యక్రమమునందు ముఖ్యాంగమైనది గ్రామనిర్మాణము. అనగా గ్రామవ్యవస్థానిర్మాణము. గ్రామములలోనిజనులు బయటివారికై దేనికిగూడ నాధారపడకుండుట, న్యాయనిర్ణయముకొఱకుగాని, ఆహారపదార్థములవిషయమైకాని, సౌఖ్యసంపాదనమునకై గాని, యేవిషయమునకై గాని పరదేశముల మీదనేగాక పరగ్రామములపై గూడ నాధారపడకుండుట. దేశపరిపాలనమునకు గావలసినకర్చు లందుమూలమునజాలదగ్గించుట. జనులలో పరస్పరానురాగము హెచ్చించుట.ఆత్మగౌరము,ఆత్మశక్తి వీనిని పెంపొందించుట. జనులలోనిత్యాగశక్తినిమేల్కొల్పుట. గ్రామనిర్మాణమునన్ని యునిమిడియున్నవి.

ప్రాచీనభారతదేశమునందేమి, గ్రీసునందేమి యీ పద్ధతి యాచరణయందుండినది. ఆనాటిభారతదేశము స్వర్గమునకన్న మిన్నగనుండెడిదని మనమనుశ్రుతిగ తెలియుచుండుటయేకాక, విమతస్థులు విదేశీయులునగు బండితులెందఱో తెల్పుచున్నారు. ఆనాటికీనాటికి చాలభేదముకలదు. ఆనాటిజనులది యాధ్యాత్మికదృష్టి. యీనాటినవనాగరకులది ఆధిభౌతికదృష్టి. ఈనాటిదృష్టి యానాటిదృష్టిగ మాఱననేకాని మానవునిజీవితోద్దేశములుఫలింపవనినావిధే యాశయము.

ఈ గ్రంథములోని భావమునాది యొకటియుకాదు. ఈ గ్రంథభావములు ఆసఫాలీగారివి. మన్మిత్రులగు చీమలవాగుపల్లె నారాయణరెడ్డిగారీ గ్రంథమునననువదించి యిమ్మనికోరిన కారణమున వ్రాసితినికాని యిందలియాశయములెంతమంచివిగ నున్నను, దానిలోనిరూపించిన వ్యవస్థయెంతచక్కనిదై జాతీయత

నుగాపాడుటకు యత్నించుచున్నను మొదటినుండి చివరవరకుపాశ్చాత్యులనవనాగరక వాసనయేతగులుచున్నది. ఇది యెంతవరకునుపకరించునో యంతవరకే యుపకరించుకొని గ్రంథకర్తయొక్కపవిత్రములగు నుద్దేశములగ్రహించి యిట్టివ్యవస్థలకలిగించుకొని, జనులుస్వరాజ్యము చేరువకుబోదురని ప్రార్థించుచువిరమించు చున్నాను.

ఈ గ్రంథమును ద్రవ్యమపేక్షింపక ముద్రించియిచ్చినందులకు తాడిపత్రి రెడ్డిప్రెస్ వారికి నాకృతజ్ఞతా పూర్వకవందనము లర్పించుచున్నాను.

కోధనసంవత్సర<br>ఆషాఢ శు ౧లు<br>తాడిపత్రి. } కలచవీడు వేంకటరమణాచార్యులు.



# గ్రామపునర్నిర్మాణము



## ౧. భాగము

### ప్రతినిధిమహాసభ

సూత్రప్రతిపాదనము.

ఏనడుచేయుకార్యముయొక్కపద్ధతినివాడునిర్ణయించుకొనుట మానవునిజన్మహక్కు. కానితానుచేయుగార్యములుతాను నడచునడవడి తనచుట్టుప్రక్కలనివసించుజనులహక్కులకులోనై యుండును. అందుచేప్రాచీనభారతదేశముననొకవిధానమునిర్మింపబడెను.సంఘమునకు, దానియందలివ్యక్తులకుజన్మచేతనేకొన్నిహక్కులుకలవు. ఆవిధానముచేనీహక్కులస్వచ్ఛందతావినియోగముసురక్షితమాయెను.జనులపరస్పరసంబంధములకుసామరస్యముసత్యాయుతమాయెను.ఆవిధానమునకానుపూర్వికముగబంచాయతీయనుపేరువాడుకయందున్నది.అదిసర్వవిధములగు వివాదములబహిష్కరింపగలదు.పరస్పరవిరుద్ధములగులాభములనుపొందుకలిగించును.వ్యక్తులస్వేచ్ఛను భద్రపఱచును. సాంఘికవ్యవస్థకుప్రాణసమానములగు సంప్రదాయములను బవిత్రవంతములుగ రక్షించును. నిరంతరమై యతిసూక్ష్మమగు మెలకువతో నున్నతములగు నీతులనభ్యసింపజేయును. వేయేల! అవయవపరిపూర్ణమగు మానవసంఘముయొక్క యభివృద్ధి తనచేతులలోనుంచుకొని నడిపింప

గలది యీపంచాయతీపద్ధతి. దీనికిదాయాదియనదగిన యింకొకపద్ధతిగలదు. అదికడుగడుసుగ బెరిగినది. సంఘములోని స్వపరిపాలనా సంస్థలచేతులలోనుండి క్రమముగ సర్వవిషయములపైని యధికారమును లాగికొనినది. ఆసంస్థలలో నెలకొనియుండిన చైతన్యమును బయటికిదరిమినది. ఆకారణముచేత వ్యక్తులస్వయమాధారతయనుశక్తి సంపూర్ణముగ నాశమైనది. ఆపంచాయతినామ మాత్రావశిష్టమయినది. జనులుతమకార్యములు తామే చేసికొను కష్టమక్కరలేక వారికార్యముల దానే జేయుదునని యీక్రొత్తపద్ధతి యాసగల్పించెను. ఈయాశయడియాశ. జనులశీలమును సమూలముగ చీకివేయగల సౌకుమార్య సౌఖ్యభావముల నీపద్ధతి గలిగించినది. పూర్వముపంచాయతీయెదుట నసత్యవాది యనిపించుకొనుటకంటె మరణించుట మేలుగానెంచువారు ఈనాటిన్యాయస్థానములందు సత్యభాషణమునకెంత దూరమున నున్నారో మన నిత్యానుభవములోనిదే. ఈచెడుగుమెట్లుకలిగినదో తెలిసికొనుటసులభము. అతికేంద్రీకృతమయిన రాజ్యాంగమున జనులనీతుల సూక్ష్మముగ బరీక్షించుట సాధ్యముకానిపని. ప్రజలలాభముల రక్షించు బాధ్యత వహించినవారికి బ్రభుత్వోద్యోగుల యధికారమును రక్షించుటే మొదటిధర్మమగును. ఆకారణముచేత పంచాయతీ ద్ధతియందు వ్యక్తులశీలమును రక్షించుట సంఘమునకే విధింప



బడినది. సర్వాధికారములతో నిరంకుశముగనేలినరాజుల పరిపాలనానుభవము భారతప్రజలకు జాలగలదు. ఆకాలమున రాజులు తమహక్కులకైపరస్పరము వివాదపడుచు, దమసైన్యములచేత ఘోరరణముల జేయించుచుండినప్పుడుగూడ పంచాయితీలమూలమున బరిపాలనము మాత్రమవిచ్ఛిన్నముగ సాగుచుండెను. ఈదినము ప్రభుత్వము శాఖోపశాఖలైయున్నది. బ్రహ్మరంధ్రమున వేడియుండినను గాలుసేతులు చలువలు ముంచుకొని వాయువు గ్రమ్ముకొని చరమస్థితి యందున్నవి. కావునప్రభుత్వమెటుబోయిననుసరే దానిగతిదానిది. అనివదలి స్వయంనిర్ణయపద్ధతుల ననుసరించి సంఘముపునర్నిర్మాణముచేయవలెను. సంఘమంతయు చిన్నవై పరిపాలనమునకు సులభములగు భాగములుగా విభజింపవలెను. తమతమ హద్దులలో దామె పరిపాలనము సాగింపవలెను. అట్టిప్రతిసంస్థయు స్వయమాధారకమై, జాగరూకత గలిగి, యభివృద్ధిమార్గముల ననుసరింపవలెను. తమవిషయముల నిర్ణయించుకొను నధికారముతామే వహింపవలెను. తమతమహద్దులకు లోనై తామేపరిపాలన వహింపవలెను, అనుభవింపదగినహక్కులన్నియు, నిర్వర్తింపవలసిన ధర్మములన్నియు, స్త్రీపురుష,సంపన్నదరిద్రభేదములేక సంఘములోని యుక్తవయస్సుగల జనులందఱకును జెందును. కావునప్రథమమున వీరందఱు జేరి మహాసభగానేర్పడవలెను. తమసంఘమును వీరందఱు బరస్పరసహకారు

లై నిర్మించుకొనవలెను. వారుసంఘమును నిర్మించు నాలోచనలు సేయునపుడీ క్రింది మూల సూత్రముల ననుసరింపవలెను.

1. మానవులందఱు పుట్టుకచేతనే స్వేచ్ఛను సమానత్వమును గలవారు. కావున యితరులస్వాచ్ఛందతకు భంగము కలిగింవనంతవరకు దమయిష్టమువచ్చినట్లు నడుచుటకు ననివార్యమగు హక్కువారికిగలదు.

2. సంఘము జీవించి దినాభివృద్ధి నందవలయుననిన, జనసముదాయాభిప్రాయము ననుసరించి పాలించుకొనవలెను.

3. సంఘములోని యధిక సంఖ్యాకులచేతనే సంఘముయొక్క యధికారము లితరులకియ్యబడవలెను. అట్లు దత్తమైనయధికార వినియోగమును ప్రజలు మిక్కిలి జాగరూకతతో బరీక్షించుచుండవలెను.

గ్రామ లేక
నగరసంస్థ

ప్రతిగ్రామముకాని పట్టణముకాని సహజముగ నొకసంస్థయగును.అది సజీవమై, చైతన్యయుతముగ నుండవలెనన్నిన దనలోజానుచక్కనివ్యవస్థకలిగించు బాధ్యత తప్పకవహింపవలెను. రాష్ట్రపాలనముయొక్క సౌలభ్యములను మనస్సుననుంచుకొనిన నన్నిప్రాథమిక సంస్థలలోనిచర్యాక్రమము (ప్రొసీజర్) నేకవిధముగ నుండవలయును కాని భిన్నముకారాదు. ఒకసంస్థ, పెత్తనమునందిన తన నియోజకుల (వోటర్ల)సంఖ్యకును దనయవసరములకును దగినట్లు ప్ర



తినిధుల సంఖ్యను నిర్ణయించుకొనవలెను. గ్రామసంస్థలవిషయమున ఈయవసరములల్పములు సులభములు. కలకత్తా,బొంబాయి,మున్నగు పెద్దపట్టణములలో చిక్కులుకలవై యీ యవసరములధికముగనుండును.

2. పైజెప్పబడిన నగరసంస్థలలో వేగురు (వేయి)నియోజకుల కొక్క ప్రతినిధిని నిర్ణయించుట తప్పకాదు. కాని పరిస్థితుల ననుసరించి దామాషామార వచ్చును.

3. ఢిల్లీ రాష్ట్రపుజనసంఖ్య నాలుగున్నర లక్షలు. వారిలోనియోజకులు 1 లక్ష. ఆప్రదేశమంతయు నిరువదియైదు భాగములుగా విభజించిన ప్రతిభాగమునకు నాల్గువేల నియోజకులుందురు. స్వార్థరహితులై తమసర్వకాలమును వినియోగింపగలవారు తక్కువగా నుండుటను మనసుననిల్పి నాల్గువేల నియోజకుల కొక్కొక్క ప్రతినిధిచొప్పున నిర్ణయించుకొనవచ్చును. అంతయధికమగు నియోజకులసంఖ్యతో కార్యముల నిర్వహించుటకష్టములు వేటొకచో జనింపబడును.

గ్రామములోని ప్రతి నియోజకుడు సభాకార్యక్రమమున పాల్గొనుటకు వీలయిన దినకాలస్థల నిర్ణయముచేసి మహాసభను సమావేశముచేయుట సంస్థయొక్క ప్రథమకర్తవ్యము. సభచేయునిర్ణయములకు గౌరవముకల్గించుసందఱు నియో

జకులను సమావేశముచేయించుట సాధ్యముకాదని యల్పాక్షేపణలు కలుగవచ్చును. కాని యీసభచేయుపదంతయు, మహాసభయొక్క యెన్నికల కేర్పాట్లనుజేసి వానిని జరిపించునధికారముకల అర్జీపంచాయతీ నియమించుటేకనుక, నీసభ కేకారణముచేతనైన నొక కొద్దియునియోజకులు రాలేదని నొప్పిపడబనిలేదు. కాని సభను సమావేశపఱచువారు నియోజకులలో నెంతయధిక సంఖ్యసాధ్యమో యంతయధికసంఖ్యను చేర్చుటకును, చేర్చినపిమ్మట తాత్కాలిక ప్రతినిధులయెన్నికల విషయమున నేకగ్రీవతగలిగించుటకును, దగిన జాగరూకతవహింపవలెను.

పైచెప్పినవిధమున ప్రజాసభ, యాప్రదేశమున కెన్నివాడలుకలవో యందఱు ప్రతినిధులనెన్నుకొనవలెను. సాధ్యమయినంతవరకు యాయావాడల నివాసులనే యాయావాడలకు బ్రతినిధులుగ నెన్నుకొనవలెను. అట్లయిన కార్యనిర్వహణము సుసాధ్యమగును. సభనుసమావేశపఱచువారు కొన్నిసూచనల సిద్ధము చేసికొనియుండుట వివేకము. అట్లుండకున్న సభాకార్యము ముగించుటకు చాలకాలము పట్టును. ప్రజాసభ తాత్కాలికముగ నీక్రింది యధికారములను బంచాయతీకియ్యవలెను. ఇది యొకతీర్మానరూపముగనుండవలెను.

(1) తమయుద్యోగులనెన్నుకొనుటకు దమకునిర్ణయించిన ధర్మ



ములనిర్వర్తించుటకుదగినచట్టముచేసికొనునట్టియధికారము,

(2) మహాసభయొక్క యెన్నికల నేర్పాట్లుచేయుటకు నాయెన్నికల తనిఖీచేయుటకు నధికారము. ఎన్నికలుముగిసి స్వధర్మమును నిర్వహించుట కారంభించువరకు తాత్కాలిక సంఘము పనిచేయవలెను.

(3) ప్రతినిధులయెన్నికలు ముగిసినతోడనే ప్రతివార్డునందలి నియోజకులపేర్లను దెలుపుజాబితాలను సిద్ధముచేయవలెను. ఏవాడప్రతినిధి యావాడలోనినియోజకులజాబితా సిద్ధముచేయుబాధ్యతవహింపవలెను ఈకార్యమొకపక్షముదినములలో ముగియవలెను. యోగ్యులగు స్వచ్ఛందసేవకుల సహాయమున నీకార్యము నిర్వహింపవలెను.

ఈక్రింది సూత్రములననుసరించి నియోజకుల జాబితాలను సిద్ధముచేయవలెను. ఏవాడలోని ప్రతినిధియావాడ జాబితా సిద్ధముచేయవలెనని చెప్పియుంటిమిగదా? ఆప్రతినిధితానెన్నుకొనబడిన తర్వాత రెండురోజులలోగా, ఆవాడలోని పెత్తనము వహించిన వారందఱు దమపేర్లను నియోజకులజాబితాలో నమోదుచేయుంచుకొనవలెననియు, దానునియోజకుడయినట్టు యోగ్యతా పత్రము నందవలెననియు యుక్తరీతినిబ్రకటించు యత్నములజేయవలెను. ఈపనినిచేయుటకు మూడుపద్ధతులున్నవి. దండోరావేయుంచుటొకటి. స్వచ్ఛందసేవకులచే

నింటింటికి జెప్పిపంపుటయొకటి. కాగితములపై బెద్దయక్షరములతో నచ్చువేయించి బహిరంగస్థలములలో నతికించుట మూడవది. ఈత్రివిధములగూడ ననుసరించి పనిచేయవలెను. నియోజకుడుగా నుండదగిన ప్రతియొక్కని దనపేరునుజాబితాలో నమూదు చేయించుకొనునట్లు ప్రోత్సహింపవలెను. దీనినికూడ స్వచ్ఛంద సేవకులుచేసిననే తృప్తికరముగ నుండును. స్త్రీనియోజకులజాబితాలను సిద్ధముచేయుటకుఘోషాస్త్రీలనియమింపవలెను. గ్రామములలో పనిచేయుటకు చదువనువార్యనువచ్చినవారు చాలినందఱు దొరకకపోవచ్చును కాని చుట్టుప్రక్కలనుండుపట్టణముల నుండిరప్పించుకొనినచో నీలోపముసవరణయగును. మొదటజాబితా యుండవలసినంత పరిపూర్ణముగ నిర్దుష్టముగనుండునని యెవ్వరుననుకొనరు. ఏలందురా? చూడుడు! ఇప్పుడు ప్రభుత్వమువారినౌకర్లచే సిద్ధముచేయబడు జాబితాలలో తప్పునమూదులులేని పుటయొక్కటైనను నున్నదేమో? జాబితాలలో నమూదుచేయుట పదునైదవరోజున నిలుపవలెను. జాబితాలను బరిశీలించుట తాత్కాలిక సంఘమువారివశమున నీయవలెను.అందుకేర్పడినసభ్యులుతప్పులసవరింపనారంభింపవలెను. ఇందుకుకూడ స్వచ్ఛంద సేవకులసహాయమవసరము. బహిరంగస్థలములలో నీజాబితాలనంటించవలెను. సవరణలుండిన తెలుపునట్లు ప్రజలగోరవలెను.



నియోజకులజాబితాలోని నమూదులకాక్షేపణలు.

ఆక్షేపణలు దాఖల్ చేసికొనుట కొకవారముదినముల వ్యవధి నిర్ణయించుకొనవచ్చును. ఆక్షేపణలగ్గమునించి యాయా జాబితాల సిద్ధము చేసిన ప్రతినిధుల ద్వారా విచారణ సల్పి ఉచిత కాలమున బరిష్కరింపవలెను. తాత్కాలిక సంఘము ఎన్నికలకైయొకదినమును నిర్ణయింపవలెను. ఈనిర్వచనము, సవరణచేయబడినవోటర్లజాబితాలుప్రకటితములైన 15దినములలోపుగానుండవలెను.

ఎన్నికలకభ్యర్థులు

ఎన్నికలకు నిలువదలుచుకొనినయభ్యర్థులు, దరకాస్తులు పంపుకొనవలెను. ఇందుకువలసిన అచ్చుఫారములు తాత్కాలికసంఘ కార్యాలయమునుండి తెప్పించుకొనవలెను. అతనిదరఖాస్తునామోదించు నియోజకులుకొందఱుండవలెను. నియోజకపరిదేశముచిన్నదైన 10 గురు, పెద్దనగరమైన 25 లేకముప్పదిగురుండవలెను. ప్రతిదరకాస్తును, తాత్కాలికసంఘాధ్యక్షునకు సమక్షమియ్యవలెను.అభ్యర్థులకుండ దగినయోగ్యతలన్నియు బరీక్షించిన వెనుక నభ్యర్థులుగా నుండ యోగ్యులగు వారిపేర్ల జాబితాల నాయావాడలలో ననేకస్థలములలో నంటింపవలెను.

అభ్యర్థిగా నుండదలచువ్యక్తి పురుషుడుగానుండవలెను. 25 సం

అభ్యర్థికిగావల
సినయోగ్యతలు

వత్సరములకు తక్కువకాని వయస్సు కలిగి స్వస్థచిత్తుడుగా నుండవలెను. అసహాయోద్యమము ప్రమాణపూర్వకముగా నంగీకరించియుండవలెను. నగరసంస్థలయినయెడల వ్రాయనుజదువను తెలిసి యుండవలెను. గ్రామసంస్థలకు వ్రాత చదువువచ్చినవారు ప్రతినిధులుగా దొరకుట చాలకష్టముకాని నగరసంస్థల పట్లమాత్రము రెండవయోగ్యత యుండి తీరవలయును.

అక్షరాస్యత
పంచాయతీద
రులకుతప్పని
యోగ్యత

అక్షరాస్యత (వ్రాతచదువులు) సర్వవిధములవృద్ధిసేయవలయును. సమ్మతి నొసగుహక్కు నందలి విలువను గ్రహించునట్లుచేయవలెను. వ్రాతచదువులవృద్ధిసేయవలసియేయున్నది. కావుననిప్పుడుకాకున్న నికకొంతకాలమునకునైన నియోజకులకు గూడ నక్షరాస్యత యోగ్యతగానిర్ణయింపవలె “ను. తలకొక సమ్మతియను బెంథామీయ సూత్రమున కీనియమము విరుద్ధము. మనజాతీయావసరముల కనుగుణముగ నీసూత్రమునుపయోగించుకొనవలెను. ఆదర్శమునుతగ్గించనవసరములేదు. కాని దేశములోని పరిస్థితులననుసరించి హెచ్చుతగ్గులనిర్ణయించుకొనవచ్చును. స్పార్టాలోపౌరస్త్వమునకు(పురజనునిహక్కు) దేహబలమెట్లుపరీక్షాంశముగనుండెనో భారతదేశమునబుద్ధిబలమట్లుపరీక్షాంశముగ నుండవలెను. ప్రాచీనకాలమందలి నాగరకప్రపంచ



మునకు మనము బుద్ధిబలముచే నాయకత్వమును వహింపలేదా? ఇప్పటికిగూడ మనయాశయ మదియేకదా! మనమువిజయము నొందుటకు నిష్కల్మషములగు నహింసాపద్ధతుల నారంభింపలేదా? అట్లవలంబించి, మానవులభాగ్యమును నిర్ణయించుటకు పశుబలమునుపయోగించి విసిగిన ప్రపంచదృష్టినప్పుడే మనముసంపూర్ణముగ మార్చుచుండలేదా? ప్రతినిధులుగా నిర్వాచింపబడుటకర్హులగు వారిపేరుల జాబితాలు ప్రకటితములైన వారమురోజులలోగా నెన్నికలుజరుపవలెను. తాత్కాలికసంఘ మాప్రదేశమందలి యన్నివాడలకు నెన్నికలుజరుగు దినకాలస్థలనిర్ణయముచేయవలెను. సమ్మతులనమూదుచేసికొను నుద్యోగులనియమింపవలెను. వీరికి స్వచ్ఛంద సేవకులు తోడ్పడవలెను. ఎన్నికలు జరుగుస్థలముకాలము దినము బాగుగా ప్రకటింపవలెను. ఉద్యోగులే నిర్వాచనశాలల [పోలింగుబూత్ స్] నేర్పాటుచేయవలెను. అవి అందరునియోజకులకు నందుబాటులోనుండవలెను. నిర్వాచనము జరుగుదినముననిర్వాచనోద్యోగులు నిష్పక్షపాతులముగనుందుమనియు రహస్యమునురక్షించెదమనియు, బహిరంగముగ బ్రమాణముచేసి సమ్మతులవ్రాయింప నారంభింపవలెను. ఆప్రమాణమునియోజకులయొక్కయు నభ్యర్థులయొక్కయు సమక్షమునజరుగవలెను. సమ్మతులువ్రాసినకాగితములువేయుటకుముందుసమ్మతులువేయుపెట్టెను నియోజకులకు నభ్యర్థులకువట్టిదిగా

చూపించి బీగము వేయవలెను. అట్లు బీగము వేసినపట్టి పెట్టెలో సమ్మతి కాగితములు వేయవలెను. నియోజకులు తమ యోగ్యతాపత్రమును ఉద్యోగులకిచ్చిన తర్వాతనే యీపెట్టెలో సమ్మతులు వేయ నర్హులగుదురు. సమ్మతులనిచ్చుట రెండుదినములు జరుగవలసి యుండిన యెడల, దినాంతమున నిర్వచనోద్యోగి యభ్యర్థుల సమక్షమున పెట్టెకు లక్క మొహరు వేయవలెను.

వోటుల లెక్కించుట.

సమ్మతులనిచ్చుట ముగిసినతోడనే యభ్యర్థుల సమక్షమున నిర్వచనోద్యోగి సమ్మతుల నెంచి యధిక సమ్మతుల నందినవాడెన్నుకొనబడినట్లు ప్రకటించి, సమ్మతులమరల పెట్టెలోనుంచి, ప్రత్యేకముగ సిద్ధము చేయింపబడిన తాత్కాలిక సంఘపు మొహరుతో లక్కముద్ర వేయవలెను. ఆపెట్టెను తాత్కాలిక సంఘ కార్యాలయమున నుంచవలెను. ఆక్షేపణలు వినుటకు నిర్ణయింపబడిన కాలము ముగియు వరకు, సమ్మతుల రూపుమాపగూడదు.

ఎన్నికల కాక్షేపణలు

తాత్కాలిక సంఘము వారిచే సక్రమముగ నెన్నుకొనబడిన మఱి నల్గురు అభ్యర్థులతోగూడ తత్సంఘాధ్యక్షుడు ఆక్షేపణలువిని సకాలమున వానిని బరిష్కరింపవలెను. ఎన్నికలు జరిగిన తర్వాత 15 దినములలోగా దాఖలు చేయని యాక్షేపణల వినగూడదు. ఏయభ్యర్థినిగుఱించైన నాక్షేపణలు వచ్చిన యెడల తాత్కాలిక సంఘము



వారితీర్పే కడపటిది. ఆయభ్యర్థియెన్నిక తప్పైనయెడల నతనికి తర్వాత నధిక సంఖ్య సమ్మతులు వచ్చిన వారెన్నుకొనబడినట్లు ప్రకటింపవలెను.

ప్రస్తుత ప్రభుత్వముతో ఘర్షణకూడదు.

ఎన్నికలు ముగిసిన వెంటనే తాత్కాలిక సంఘము సర్వనియోజక (వోటర్ల అందఱియొక్క) బహిరంగ సభనొకదానిని జరుపవలెను. ఆసభలో సక్రమముగ నెన్నుకొనబడిన ప్రతినిధుల కీక్రింది విషయముల పరిపూర్ణాధికారము నీయవలెను. నియోజకులందఱియొక్క హక్కులను, లాభములను, మూడులేక ఐదుసంవత్సరముల కాలము రక్షించి, కాపాడి, సవరణచేసి, సామరస్యము కలిగించి యభివృద్ధిచేయుట కవసరములగు నన్ని యత్నములచేయు నధికారమొకటి. పంచాయతీకార్యమును జరుపుటకు గావలసిన చట్టములు, రెగ్యులేషన్లు చేయు నధికారము రెండవది. వ్యవహారవిషయముల తీర్పులు చెప్పుట మూడవయధికారము. ఈతీర్పులను నియోజక సమూహము శిరసావహింపవలెను. మానవుల అన్నివిధములైన చర్యలవిషయమై యీపంచాయతీ తీర్పు చెప్పవచ్చును. కాని ప్రస్తుత ప్రభుత్వముతో ఢీకొనకుండ జాగరూకతతో ప్రజలు వర్తింపవలెను. ప్రస్తుత ప్రభుత్వముతో శాంతిపద్ధతుల ననుసరించి సంబంధమంతయు దెగగొట్టుకొను నుద్దేశముతో సంఘపునర్నిర్మాణము చేసికొను

టకే, దానితో డీకొనరాదని నిర్ణయింపబడినది.

సంఘ (కుల) బహిష్కారము.

పంచాయతీతీర్పులకు బ్రజలనువిధేయులజేయునవిసాంఘిక రాజకీయబహిష్కారములే. ఆశయ మున్నతమైనకారణమున పరిపాలనమందుసహానభావము,వ్యక్తిరొక్కయు రాష్ట్రము యొక్కయు సౌఖ్యముపట్లవృష్టియు, నుండవలెను. ధర్మలోపముగాని యధర్మాచరణమునుగాని సాగనీయరాదు. ఇయ్యదిపై యుద్దేశమున ననుకూలించియుండవలెను. శిక్షలు దండన (జరిమానా) రూపమునమాత్రమే యుండవలెను. ప్రజలస్వచ్ఛందవృత్తి నరికట్టుటకంటె సాంఘికబహిష్కారమే యధికతరముగ నేరముల నాపగలదు. వారిహక్కులను అధికారములను అధికముగ దెగగోయ గలుగుటయే సాంఘికబహిష్కారమును పదునైనయాయుధముగ జేసినది. పంచాయతీతీర్పుల జరిపింపవలయుననిన పెద్దప్రదేశము ననేక భాగముల జేయవలెను. ఒక్కొక్కచిన్నభాగమున కొక్కొక్కసంస్థనేర్పరుపవలెను. ఇంతయు గార్యనిర్వాహణమును సులభముచేయుటకే. వ్యక్తులనుజాగరూకతతో నడిపించి సుశిక్షితులజేయ నీపద్ధతితోడ్పడును. ఇందుమూలమున రాష్ట్రమునకుసౌఖ్యము మంచికలిగించుకొనవచ్చును. సాంఘికరాజకీయ బహిష్కారములు సంపూర్ణముగగాని యసంపూర్ణముగగాని యుండ వచ్చును. అసంపూర్ణ బహిష్కా



రమనగా ప్రజలరాజకీయ స్వత్వముల దీసివేయుటయే ఉదాహరణము. రాజద్రోహమునకై విధింపబడినశిక్ష లేక సంఘములోని వ్యక్తులతోబరస్పర సంబంధములును అందువలనగలుగు లాభములను తాత్కాలికముగ తీసివేయుట. ఆనేరములుచేసిన వారికి వర్తకులేవస్తువునుగాని విక్రయింపకుండుట. పనిబాటలవారింట కసవూడ్చకుండుట. నీళ్లవారు నీరుతెచ్చియివ్వకుండుట. వేయేల! అనుదినము వివిధకులములవారు(వృత్తులవారు)జరుపుచుండిన యేవిధమైనలానాదేనా కానిబహిష్కృతులైనవారితో జరుపరాదు. వారితో నెట్టిసంబంధమును బెట్టుకొనరాదు. నేరములగొప్పనుబట్టి బహిష్కారరూపముయొక్కతీవ్రతయు సవరణకావలయును. సాధ్యమైనంతవరకు అతితీవ్రమగుబహిష్కారరూపములగొప్పనేరములకే వినియోగింపవలెను. శిక్షానుక్రమణికనొకదానిని సిద్ధముజేయవలెను. ఒకానొకపరిపాలనావిధానమందు, విశేషాభిమానముగలయతడు సాంఘికబహిష్కారమునకు అల్లరిమూకలపాలనమని పేరుపెట్టెను. కానిబూతులుతిట్టినంతమాత్రమున వాదమగునా? జనులువివేకమువయోగించి తాముస్వయముగ నిర్ణయించుకొనిన యొకానొక పద్ధతినవలంబింప నిశ్చయించుకొనినయెడల పితామహునికిగూడ వారినిదప్పుపట్టునధికారములేదు. గ్రేట్‌బ్రిటన్‌లో ప్రజాప్రతినిధులనబడువారిచేత ననుదినము నేదోయొక విధమున ముందువెనుకలకుసాగిం

వబహుచుండు రాజ్యాంగపద్ధతి యెంతమాత్రమల్లరిమూకల ప్రభుత్వమో యదియు నంతమాత్రమే. ఇట్టిపెడబుద్ధులను నసహానులనుగుఱించి, రాజ్యాంగశాస్త్రవేత్తయగు బెంథాముచెప్పినదిచూడుడు. ఎచ్చటతమకురుచించు ప్రభుత్వవిధానములేదో యచ్చట వారిదృష్టికి బానిసలుతప్ప నితరులుగోచరింపరు ఈ బూటకపు బానిసలు తమస్థితికిసంతృప్తిజెంది దానినిమార్చుకొననుద్దేశింపరేని, వారినినీచముగజూచి యగౌరవింతురు." ఏతద్విధవిమర్శకులకు మిల్ ఈక్రిందిపలుకులలో నుచితమగుప్రత్యుత్తరమొసగినాడు. పరులహితబోధలను, హెచ్చరికలను లెక్కపెట్టకపోవుటచే గలుగుచెడుగులకంటె నితరులు తనమేలుగా భావించుపనుల దానుజేయుట కంగీకరించుటవలన గలుగుచెడుగుచాల గొప్పది"

ఈవిధముగ నెన్నుకొనబడినప్రతినిధులు (పంచాయతీదారులు) తాము తమకొసగబడిన యధికారములవినియోగించుపట్ల, సత్యసంధత, నిష్పహితబుద్ధి, శ్రద్ధ, జాగరూకతజూపింతుమని తమతమ మతసంప్రదాయములననుసరించి భగవంతునిముఖముచూచి ప్రమాణముచేయవలెను. ప్రతినిధులుబహిరంగముగ ప్రమాణముచేయుదినము, మహోత్కృష్టదినముగభావింపవలెను. అంతేకాదు. ఆదినము గ్రామమునకు పండుగదినముగనిర్ణయింపవలెను

పంచాయతీ దారుల ప్రమాణము



భారతభూమిని నివాసముగ నేర్పఱచుకొనిన వివిధసంఘముల [కులములు] విపరీతమతాచార కారణముగనో, పరస్పరస్నేహభావ పోషకముగాని పోటీభావముతోడనో, లేకవివరింపరాని సందర్భసంఘటనములతోడనో, వారివారిపండుగలకు నుత్సవములకు ప్రత్యేకత్వము కొంతకలిగినది. కొందఱు, సంఘవిచ్ఛేదకశక్తుల యభివృద్ధినిగోరుచుండు మూర్ఖులగు నిరక్షరకుక్షులు గోరంతను గొండంతగ జేయుటకీప్రత్యేకత్వమవకాశమును గలిగించినది. ప్రాచీనమైనతత్త్వమవలంబించిన హిందువులకు చారిత్రకముగగాని మతసంబంధముగగాని రోదనమును దెలుపునుత్సవములుగాని పర్వదినములుగాని లేవు. అఖిలభారతీయులచే సమ్మానింపబడు తిలకువంటి జాతీయనాయకుల మరణదినమే వారిసంఘమునకు దుఃఖదినము. మహమ్మదీయుల విషయమున భేదముకలదు. మొహరంలోని పదుమూడుదినములు వారికిమతసంబంధమై యెడతెరిపిలేనిదైన సర్వసంఘరోదనకాలము. భారతదేశమందలి వివిధజాతు లొకరియుత్సవములో నొకరు పాల్గొనుచుండుట ప్రశంసనీయమైనను, వారందఱకుసామాన్యమగు భారతజాతీయ పర్వదినములేదు. జాతీయోత్సవములు సృష్టించి యుత్సాహముతో సాగింపవలసిన యక్కఱమిక్కిలికలదు. ఆకారణమున పంచాయతీకి సంబంధించిన పవిత్రసందర్భములన్నియు, జాతీయోత్సవసమయములుగ భావింపబడ

వలెను.

తాత్కాలిక పంచాయతి ముగింపు

ప్రతినిధిమహాసభ నిర్మితమైనతోడనే, తాత్కాలికసభాధ్యక్షుడగ్రాసనాధిపత్య మువహించి, ప్రతినిధిమహాసభయొక్క ప్రథమ సమావేశము నారంభించుచు, దమగ్రామములోని ప్రత్యేకపరిస్థితులు, అప్పటిరాజకీయ మతసాంఘిక సమస్యలు మొదలగు వివిధవిషయములు విమర్శించి తాత్కాలికసభ యంతటితో నంతరించెనని ప్రకటించును. కానిప్రతినిధిమహాసభాధ్యక్షుని యెన్నికజరుగునంతకు దానే యధ్యక్షుడుగానుండును. ఇంతటితో తాత్కాలికపంచాయతీజీవితముముగియును. తనజన్మహక్కులగు సంపూర్ణాధికారములను రక్షించి సద్వినియోగముసేయుటకై నియోజకసముదాయ మధికారము దేనికొసంగెనో, యాప్రతినిధి మహాసభ ధర్మాచరణ ధర్మనిర్వాహణముల నారంభించును.

ప్రతినిధికి వేతనము లేదు.

పాశ్చాత్యప్రజా ప్రభుత్వపద్ధతుల ననుసరించి యితరదేశములలో పంచాయతదారులకు వేతనముండిన నుండవచ్చును. లేకుండిన లేకపోవచ్చును. కానిమనరాష్ట్రములో నందఱు ద్రవ్యలాభమును పాటింపని సేవకులుగానుండవలెను. పాలన ధర్మనిర్వాహణములు సేయు నుద్యోగములన్నియు వేతనరహితములుగ నుండవలెను. ఆర్థిక



పరిస్థితులబట్టి యీసూత్రమును మార్చవలసియుండిన గొంత నిర్ణీతకాలమువరకు గొంచపాటిగౌరవభృతులనీయవచ్చును.

ప్రతినిధిమహాసభ.

పైచెప్పబడినవిధమున నెన్నుకొనబడిన ప్రతినిధిమహాసభయందు నియోజకులకు గౌరవముండి దానికి వారువిధేయులగుట సహజము. పంచాయతీపద్ధతి భారతదేశపుటత్యంత ప్రాచీనసంప్రదాయములలోనిదని ప్రజలయభిప్రాయములగుట, యొకానొక గురుత్వాధికారజ్యోతి వారిచుట్టు (పంచాయతీదారుల) వెలుగుచుండును. నిష్కళంకమగు న్యాయబుద్ధితో, కేవలముధర్మనిర్వర్తనభావముతో చేయబడిన వారితీర్పులు ప్రజాహృదయముల నాకర్షించి, యాత్మగౌరవభావమును గల్పించి, స్వయమాధార భావమును నెలకొల్పును ప్రస్తుతవిధానముప్రజలకు బూటకములగు కొన్ని యనుకూలములు గలిగించినది. ఆయనుకూలములు ప్రజలలోని యాత్మగౌరవభావ ప్రోత్సాహకములగు సహజశక్తులనడచివైచినది, అంతేకాదు. ఇంకొకటిమిక్కిలి యాశ్చర్యకరమయినది. అశక్తతయను భావమునుగలిగించినది. ఆకారణమున వారుస్వధర్మత్యాగముచేసి, ఐహికజీవనప్రపంచములో నిమ్నస్థానముల ద్రోయబడిరి. పరువుసాయముకొరక స్వసంఘముల పునర్నిర్మాణమను సాహసకార్యమును జేయగలిగిరా వారిప్రస్తుతస్థితిమారి నూతనత్వముసిద్ధించును. ప్రపంచమందలి తక్కువజాతులలో ప

మానమగు జన్మస్వాత్వముల నాకాంక్షింతురు. తనకులోబడిన యెడల దేనిని పశుబలము హరించునో యాస్వాతంత్ర్యము—దేహస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము క్రియాస్వాతంత్ర్యము—నపేక్షింతురు,

ప్రతినిధిమహాసభ ప్రతిమూడు లేక ఐదుసంవత్సరములకొకపర్యాయమెన్నకొనబడవలెను.

ప్రతినిధిమహాసభా సమావేశములు బహిరంగములుగా నుండవలెను. కానికొన్నిప్రత్యేకకారణములచే బహిరంగముగ జరుగకపోవచ్చును. వారిచేజరుపబడిన కొన్నివిషయములు ప్రకటింపబడక పోవచ్చును.

అధికసంఖ్యాకులగు నియోజకులు విశ్వాసలోపతీర్మానమును బ్రతినిధిమహాసభపై జేసిన దక్షణమది విచ్ఛిన్నముకావలెను. క్రొత్తనిర్వాచనము జరుగవలెను.

తననియోజకులలో నధికసంఖ్యాకులు తనయందువిశ్వాసములేదను అర్జీని పంపినయెడల ప్రతినిధిమహాసభాసభ్యుడు తనపదవికి రాజినామానీయవలెను. క్రొత్తగ నిర్వాచనముజరుపవలెను. (అవిశ్వాసపుటర్జీనిపంపుటకు తగిననిబంధనలు చేసికొనవలెను.)

ప్రతినిధిమహాసభ అనుదినము సమావేశముకావచ్చును కాని [illegible]కు కనీసము రెండుసారులు కూడితీరవలెను.



ప్రజాసామాన్య క్షేమమునకు సంబంధించిన సర్వవిషయములు పంచాయతి పర్యాలోచింపవచ్చును. దానిచర్చల యొక్క యుద్దేశము ప్రస్తుతప్రభుత్వవిధానముతో ఘర్షణలేనట్టియు, శాంతియుతమైనట్టియు స్వయంనిర్మాణమే!

ప్రతినిధిమహాసభ నిర్మితమై, సభోద్యోగుల నెన్నుకొనవలెను. తర్వాతకార్య నిర్వహణమునకువలయు, నిబంధనలుచేసికొనవలెను. ఒకఅధ్యక్షుని, నుపాధ్యక్షుని, కార్యదర్శులనుశేక మంత్రులను నెన్నుకొనవలెను.

నల్గురుమంత్రులెన్నుకొనబడవలెను.

(1) శాసనములను న్యాయములను బరిపాలించుచు, పంచాయతీమొహర్లను రికార్డులనుంచుకొని సత్యసంరక్షకుడుగా వెలయుమంత్రియొకడు.

(2) సాంఘికరాజకీయ విద్యాపాలనగావించుచు, జ్యోతిస్సంరక్షకుడునా నుండువాడింకొకడు.

(3) స్వచ్ఛందసేవక శాఖాపాలన నధిష్ఠించి, శాంతిక్రిమతల కాపాడుబాధ్యతవహించి, యుత్సవములనుబందుగలను జూచికొనుచు, బలసంరక్షకుడైన వాడింకొకడు.

(4) పంచాయతియొక్క ఆర్థిక విషయములను నియోజకసముదాయమును బాలించుచు, వ్యాపార, వాణిజ్య, వ్యవసాయముల నరసికొని వృద్ధిసేయుచు సంపత్సంరక్షకుడగు

మంత్రిసాగ్గవాడు.

25 సంవత్సరముల వయసు లేనివాడు ప్రతినిధిగా నిర్వాచింపబడుట కెట్లనన్నాడో, 30 సంవత్సరముల వయస్సు లేని వాడట్లే మంత్రిపదవికి నిర్వచింపబడుట కన

వయోనియమము

ట్లే. ఇంగ్లాండు నందు మంత్రులుగా ప్రచండ మేధావులగు యువకులుండుట సత్యమే కాని యువల్పములగు బాధ్యతలు వహించుటకు, కొంత పరిపక్వమయిన ప్రపంచ యనుభవ మవసరమని నిర్ణయించుట మిక్కిలి మంచిది. ఫ్రాంసు, అమెరికా దేశముల ప్రతినిధి సభలో 25 సంవత్సరముల వయస్సు లేని వాడు సభ్యుడుగా నుండ వీలు లేదు. 30 సంవత్సరములు లేనిది సెనేట్‌లో సభ్యుడుగా నుండరాదు.

ఈ విధముగా నిర్ణయింపబడిన ప్రతి శాఖ కొక్కొక యుద్యోగి మండలి యుండవలెను. వీరి సంఖ్య యెంత లేకున్న పని జరుగదో యంత యుండవలెను వారు చేయవలసిన పని గుమాస్తాగిరి. గ్రామసంస్థలలో చదువుకొని వచ్చిన వారగుదురు. గ్రామసంస్థలలోని సాంఘిక పరిస్థితులు శాఖా బాహుళ్యమునకు దారియగును. ఎవరికి దగినట్లు వారేర్పాటు చేసి కొనవలెను.

శాఖలు. ఉద్యోగమండలి.

వివిధ శాఖలకు నిర్ణయింపబడిన పనుల నెరవేర్చుట కుపయుక్త



బంధనలు ప్రతినిధి మహాసభ సిద్ధము సేయవలెను. అధ్యక్షునిచే నియమింపబడిన నల్గురైదుగురు ప్రతినిధులు, ప్రతిమంత్రికి సలహా సంఘముగ నుండవలెను. మంత్రి ప్రతినిధుల సమావేశములన్నిటియందు నధ్యక్షుడే యగ్రాసనాధిపత్యము వహింపవలెను. వారి పద్ధతులలో మార్పులు చేయదలచుకొనిన మంత్రి మండలికి మనవి చేసుకొనవలెను.

శాశ్వతపు ఉత్తర్వులు; నిబంధనలు.

తీర్మానములు మొదలగునవి వివిధ శాఖలగుండ పంచాయతీ సమక్షమునకు దేవలెను. వానిని బహిరంగముగ జర్చించి యధిక సమ్మతులచే నిర్ణయింపవలెను.

పృచ్ఛలు, చర్చలు

పక్షమున కొకసారి జరుగు చర్చలకు నిర్వాచింపబడిన ప్రతినిధులలో నధిక సంఖ్యాకులు చాలును. దినచర్య యంతయు మంత్రిప్రతినిధుల సంఘముల తో సాగవచ్చును. కనిష్ఠ సంఖ్య లేని కారణమున వాయిదా వేసిన సమావేశమునకు గనిష సంఖ్య యుండుట నవసరము.

సమావేశములకు హాజరు కావలసిన కనిష్ఠ సంఖ్య

ప్రతిమంత్రియు దన స్వాధీనమందుండు శాఖకు చక్కని వ్యవస్థ నేర్పరచవలెను. కావలసిన యుపకరణములన్నిటితో దన శాఖను సుస్థాపితము చేయుటకు వలసిన చట్టముల ప్రతినిధి సభలో బ్రతిపాదించవలెను. ఈ మంత్రుల పరిపాలనలో, పంచాయతి న్యా

యత్నస్థానములు, స్వచ్ఛందసైన్యము (వాలంటీయరు) ఆరోగ్యరక్షకసంఘములు, జాతీయవిద్యాసంఘములు, వ్యాపారసంఘములు, యిటువంటివి యననేల! సంఘాభ్యుదయమునకు వలసినవన్నియు, గోచరించి వృద్ధికావలెను. గ్రామములలో న్యాయనిర్ధారణ సంఘములు, సహకారసంఘములు, నిర్మితములుకావలెను. జాతీయవిద్య స్వదేశపరిశ్రమలు నాసక్తితో వృద్ధి గావింపవలెను.

# ద్వితీయ భాగము.

## న్యాయ శాఖ.

మానవులపరస్పర సంబంధముల గురించిన సంపూర్ణసమత్వభావమే న్యాయము. నీతియొక్క విలువను జక్కగగమనించిన న్యాయమునందవచ్చును. కావునసత్యావలంబనమున నావంతయు గొఱవడగూడదు. న్యాయనిర్ణయమునకై యిప్పుడేర్పడియుండు యంత్రములు జరుపవలసిన తంతు మిక్కిలిచిక్కులమారిదైనందున, నదియేయుద్దేశమున నేర్పడినదో యది ఫలించుటలేదు. ప్రాచీనము నిరాడంబరమునగు మనగ్రామపంచాయతీల న్యాయనిర్ణయ పద్ధతియందు, న్యాయమునుపాడుచేయు చట్టముల, ఘర్షణమును కంగారు లేదు. నవనాగరకులగున ప్రమాణికులు నధమాధములగు నిత్యాపరాధులను బెంచుపాపి



ష్ఠలములనుండి యభియోగపరులగు బ్రజల (కోర్టుకుబోవువారు)ను, అనతికాలమున సుకరముగ న్యాయనిర్ణయముచేయబడు, పంచాయతీలకు మఱబ్బునట్లయిన, ప్రస్తుతవిధానము నిలువబెట్టుచున్న దుర్నీతి దుర్నయస్థానములు మూతబడును.

ఖాట్ బునా జాతిపంచాయతి

ఢిల్లిలోనాశ్చర్యకరమగు నొకసంస్థకలదు. ఖాట్‌బునాల పంచాయతీయని దానిపేరు. వీరుమంచమునకునులకల్లువారు. వారిది పరస్పరగాఢానురాగముగల సంఘము. ఆసంఘములోని యొక్క వ్యక్తియు నింతదనుక కోర్టుముఖముచూడలేదు. అసత్యముచెప్పినట్టుగూడ దెలియదు.! వారిసంఘనాయకుడు (కులపెద్ద) వారిసివిల్ క్రిమినల్ తగాదాల బరిష్కరించుమధ్యవర్తి. వారికులమును బాలించు సంఘమప్పటప్పటికి వారుతీసికొనవలసిన కూళ్లనునిర్ణయించుచుండును. సంఘములోనిసర్వవిషయముల బరిష్కరించి చక్కనివ్యవస్థనేర్పరచును. ఇంతటికంటె సుశిక్షితమైన ప్రవర్తనజూపిన సంఘమింకొకటి గోచరించుట కష్టము. కంసాలులు, వర్తకవ్యాపారులు, కసవూడ్చువారు, సీటికాపళ్లవారు, మంగలులు, చంబారీలు, వీరందఱకు గుల పంచాయతులున్నవి. సాంఘికములేకాక వృత్తివిషయములలో గూడ వీరు తమపంచాయతీ నాయకుల తీర్పులకు దలలొగ్గుచున్నారు. కాని, ఢిల్లీలోని మంచముల్లువారి పరస్పరత గనుపించదు.

న్యాయశాఖకు సంబంధించినమంత్రి ప్రప్రథమమున వాడవాడ కొకరుచొప్పున ప్రతినిధులుగల పంచాయతీల న్యాయనిర్ణయమునకై నియమింపవలెను.

ఈపంచాయతీలు పనిచేయుటకు తగిననిబంధనలు న్యాయశాఖ నిర్మింపవలెను. చర్యావిధానము (ప్రొసీజర్) చర్యాపుస్తకములు, (మినిట్స్‌బుక్) నుంచుట, ముఖ్యమగునభియోగములు (వ్యాజ్యములు) క్లిష్టములగుతగాదాలు ఆ కేసులకుసంబంధించిన వారిప్రతినిధి మూలమున బ్రతినిధిమహాసభకు దెలుపుటయు, పంచాయతీలు నిర్ణయించిన దానికి విరుద్ధముగ జరించువారలపై బహిష్కారాస్త్రము బ్రయోగించుటమొదలగు విషయముల గురించిన నిబంధనలుచేయవలెను. ఆగ్రామములోని కులపంచాయతీలు, వృత్తిపంచాయతీలు మొదలగువాని యన్నిటియొక్క జాబితాసిద్ధముచేసి, వానినిదమసంరక్షణలోనికిదీసికొనవలెనని ప్రతినిధిమహాసభలో బ్రతిపాదించి, యా యావాడల ప్రతినిధులమూలమున కార్యములజరుపవలెను.

ప్రతినిధిమహాసభయే అప్పీలుకోర్టు.

ఈ యుపపంచాయతీలు చేసినతీర్పులను న్యాయోపసంఘము (జూడిషల్ కమిటీ) కాని, యోగ్యతగల నియోజకులలోనుండి యధ్యక్షునిచే నేర్పాటుచేయబడిన సంఘముకాని సవరణ సేయవచ్చును. ఈసంఘములో ఐదుగురికంటెతక్కువ ప్రతిని



ఘులుండరాదు. వారిలో నధ్యక్షుడొక్కడుగానుండవలెను.

అన్నివిషయములు సివిల్ కాని క్రిమినల్ కాని మొట్టమొదలీయుప పంచాయతీలే పరిష్కరింపవలెను.

ఈయుపపంచాయతీల సమావేశము.

వాడలప్రతినిధు లీవిధమున నిర్మింపవలసిన యుపసంఘములజాబితాను సిద్ధముసేయవలెను. ఈయుపసంఘములయొక్కయు నుపసంఘములలోని ప్రతినిధులయొక్కయు జాబితాలను సిద్ధముచేసికొని యుంచుకొనవలెను. పంపబడిన అర్జీలు, ఫిర్యాదులు, వివాదములు అన్నియు దానుస్వీకరించి, విని యవి యేయే యుపసంఘములకు బంపదగినవో వానివానికిబంపవలెను. విషయమే యుపసంఘమునకు సంబంధించినదో ముగురో అయిదుగురో ఆప్రత్యేకవిషయమునకు బంచాయతీగా నియమింపవలెను. విషయముయొక్క ప్రాముఖ్యమునుబట్టి సంఖ్యనునిర్ణయింపవలెను. వారువిషయమును బరిష్కరింపకపోయినను, వారితీర్పు నేపక్షమువారైన నంగీకరింపకపోయినను అత్యున్నత న్యాయస్థానమునకు బంపవలయును. అట్లుపంపవలయునా వలదాయనుట ఆవిషయమే వాడకుసంబంధించినదో యావాడప్రతినిధి నిర్ణయింపవలెను. ఆ పనిశీఘ్రముగ జరుపుటకై విచారణచేయుట యందీయుపసంఘమువారు ఏ సిద్ధముకాని చిక్కుపద్ధతిని యవలంబింపబనిలేదు. విచారణ విధమును గురించి చేయుచట్టములన్నియు చిక్కులులే

విగా నుండవలెను.

పైజాతులలో వేనిలో జేరనివారికి గ్రొత్తవిధానమునునొకదానినిసూచింపవచ్చును.

ఇప్పుడుఅసెసర్లయొక్కయుజూరర్లయొక్కయు జాబితాలు సిద్ధముచేయుచున్నారుకదా? అట్లేవాడప్రతినిధి మూవాడ పంచాయతీసభ్యులుగా నుండి పనిచేయుటకు దగినవారిపేర్ల జాబితానుసిద్ధముసేయవలెను.ప్రప్రథమముననర్జీలన్నియుదావేనిని, క్లిష్టమైనవానిని బరిష్కరించుటకు ముగ్గురు లేక ఐదుగురుసభ్యులుగలవారిపంచాయతీలను సమావేశపరచవలెను. పైనిర్ణయించినరీతి నత్యున్నతన్యాయస్థాన మునకు సవరణకైపంపు నధికారముండును.

ఇంకొకపద్ధతి. ప్రతినిధిమహాసభయే స్వయముగా నీదిగువతెల్పబడిన సివిల్ క్రిమినల్ న్యాయస్థానముల నిర్మింపవలెను.

(1) అదాలత్-ఇ-సాదరు. జిల్లా పంచాయతీకోర్టు. దీనికి 5 సంవత్సరములైనను న్యాయవాదివృత్తిలోనుండి, యసహాయోద్యమము నవలంబించిన న్యాయవాదియో, జిల్లాజడ్జీగనో, సీనియర్ సబ్ జడ్జీగానో యుండివిరమించినవాడో,అధ్యక్షుడుగానుండవలెను. ఈ అధ్యక్షునికి నొకపండితుడో, ఒకముఫ్తీయో, లేక వివాదస్వభావమునుసరించి యిరువురో, సహాయులుగానుండవలెను. ఇరుపక్షములవారిచే నే



ర్పరచుకొనబడిన మధ్యవర్తియో, ఇరుపక్షముల వారంగీకారమునకురా లేకపోయినయెడల నధ్యక్షునిచేనియమింపబడినట్టిమధ్యవర్తియొకడో యుండవలెను.మూడవమధ్యవర్తిగా నుపకరించుటకుదగిన వారిపేర్లజాబితానొకటి నధ్యక్షుడుంచుకొనవలెను. అవసరమైనపుడందులోనొకరినినియమించుకొనవలెను. ఈకోర్టుకు 5000—0—0లకు పైబడినవ్యవహారముల విచారించుటకును, తగ్గుకోర్టులతీర్పులను ఉత్తర్వులను సవరించుటకును అధికారముండవలెను. ఈకోర్టుయొక్కతీర్పులను సవరించుటకు ప్రతినిధిమహాసభయొక్క న్యాయోపసంఘమున కధికారముండవలెను.

ఈకోర్టు,దానికిసంబంధించిన తగ్గుకోర్టులు, ప్రస్తుతము న్యాయవిచారణ విధానమునకు సంబంధించి జారీలోనున్న చట్టమునను సరింపవలెను. ప్రత్యేకపరిస్థితులను బట్టియు, నీక్రింది యనుబంధ రూపకమగు విధానమునుబట్టియు, నవసరమగు మార్పులను జేసికొనవచ్చును.

(అ) ప్లైంట్లు, అర్జీలు మామూలుమేరకు దాఖల్ చేసికొనవలెను. సమన్లుపంపినతర్వాత ప్రతివాదులకు ప్లైంట్లుయొక్కకాని యర్జీయొక్కకాని ప్రతులుపంపవలెను. ఇరుపక్షముల వారందఱు హాజరైనపిమ్మట, పంచాయతీకోర్టుకు తీర్పుకైప్ఫుటకువారిరువురునుమతించునట్లు వారితోనొకయొడం

క వ్రాయించుకొనవలెను. అచ్చువేయబడికలో సంతక
ముచేయవలెను అచ్చుకాగితములు ప్రతిసిద్ధిసభవారు నిర్ణ
యించినవరకు కోర్టువారే యీయవలెను.

తర్వాత నిరుపక్షములవారి సమక్షమున దమకప్పగింప
బడినవివాదము, సత్యరక్తితో బరిష్కరింతుమని యొకప్రమా
ణముచేయవలెను. మొదలు పక్షకారులు ప్రమాణము సభ్యులకు వి
న్నోజేయించును, పిమ్మట నిర్ణసభ్యులతోడను, వాదిప్రతివాదు
లతోడను, న్యాయవాదియొప్పగించినసాక్షులతోడను, సభ్య
త్వము ప్రమాణము చేయింపవలెను. తర్వాత కోర్టువారు విచార
ణనారంభింతురు. వివాదమునకుసంబంధించి తెలుసుకొనదగిన/తెలిసియుండి
న విషయములుదాపనని న్యాయవాది ప్రమాణముచేయుటయో
యిందులోగలక్రొత్త. ఈకాలమున న్యాయస్థానములలో జరుగు
తప్పుడుతనమును నిలిపివేయుటకేయిది. న్యాయవాదివృత్తి గౌర
నావహామనివిశ్వాసము. ఏలన పాండిత్యమున కానుపూర్వికము
గగౌరవముకలదు. సత్యానుష్ఠానవిషయమున నీపండితులునీతి
మత్తను పడగొట్టగూడదని మనముకోరదగినది శక్తిసామర్థ్యము
గలవారిలో నత్యధికసంఖ్యాకులనేకములగు నౌకరుప్రభుత్వ
(బ్యూరోక్రాటిక్ ప్రభుత్వము) శాఖలలో బానిసమెలికల
లెవదగుల్కొనియుండుటయు సంతికంటెనించుక తక్కువసం
ఘములోనివిచిత్రవుహార్థికప్రవృత్తిచేత. న్యాయవాదివృత్తి



లోబడి క్షీణించిపోవుచుండుట విషాదకరమైనది. ఈవృత్తి రక్త
మునుబీల్చుజెలగవంటిది. ఇదిలవమాత్రమున్నీతినెఱుంగనిది. ఈ
ప్రతిపాదనమున [ఈమాటకు] కపవాదములేకపోలేదు. ఇదినీతి
చేబవిత్రముకాదగియున్నది. ఈప్రతిబంధమునేర్పరచినయెడల నీ
వృత్తియెడలప్రజలకుగల దృష్టియందుభేదముకలుగకలదు. న్యా
యవాదులను,సంవత్సరమునకురు 1000-0-0 లకుతక్కువకాని
రుసుముచెల్లించినమీద కోర్టుకురానీయవచ్చును. కానివారుప్ర
మాణ భంగముచేసిరనియెప్పుడు సాదరు-అదాలత్ నిర్ణయించు
నో యప్పుడు వారిసన్నదునుతీసివేసి వారిరుసుమును కోర్టుకుచే
ర్చుకొందురు.

అర్జీలువ్రాయువారికిగూడానక్లై సంవత్సరమునకు 16-0-0
సిచ్చు మీదనన్నుజ్ఞ నియ్యవచ్చును.

(2) మధ్యవర్తుల యుపసంఘము (సబ్ ఆర్బిట్రేషన్ కోర్టు)
కూడానిక్లై నిర్మింపబడును. దీనివ్యాప్తి రు5000—0—0
లు. అంతకుతక్కువ విలువగలవ్యాజ్యములకు పరిమితము.
స్వల్పవ్యాజ్యములకు (స్మాల్ కాసెస్) గాని, దివాలాఅర్జీ
లకుగాని వ్యాపింపదు. దానికొక అధ్యక్షుడుండవలెను. అత
డుబ్యారిస్టరుగనో వకీలుగనో 5 సంవత్సరములకు దక్కువ
కాకుండ పనిచేసియుండవలెను. ఒకమధ్యవర్తియుండును. అ
తడుబకపక్షియొక్కగాని పండితునియొక్కగాని సలహాను

తీసికొనవచ్చును. కానియాపండితుడుకాని మఫ్తీకానికోర్టుసభ్యులలో నొక్కడుగానుండరాదు. వివాహసంబంధమైనవివాదములు, భాగవిచ్ఛేదనమునకు, పత్రములుకొట్టివేయుటకునర్జీలు, మొదలగువానిని ప్రారంభముననీకోర్టు దాఖల్ చేసికొనవచ్చును.

స్వల్పవిషయకమధ్యవర్తిసంఘము [స్మాల్ కాసెస్ ఆర్బిట్రేషన్కోర్టు] రు 2000-0-0 లకు లోనగువిలుగల వ్యాజ్యములనువిచారింపవచ్చును. 5 సంవత్సరములు పనిచేసినబ్యారిస్టరో వకీలోయుండవలెను. మఱియిద్దరుమధ్యవర్తులుగూడ నుండవలెను. స్వల్పవిషయములకోర్టు చేయవలసినపనికి నెక్కువజాగరూకతయు, ననల్పమగు మానవస్వభావపరిజ్ఞానమునావశ్యకములు. కావునన్యాయశాస్త్రానుభవముకాని ప్రపంచానుభవము కా యల్పముగానుండువారికాపనినియ్యకూడదు.

రాజీయోగ్యములగు కేసులు మాత్రము విచారించుటకు దండనస్థానముండవలెను. ఉచితములగుషరతులతో నిరుపక్షములకు రాజీకుదర్చుటే ముఖ్యమగునుద్దేశముగానుండవలెను. మొదటి తరగతి యధికారములతో ఆనరరీమేజస్ట్రీటుగానుండి యసహాయోద్యమముననుసరించి యదివదలినవానినైనను, వృత్తిచాలించిన న్యాయవాదినైనను, నీ కోర్టుకునియోగింపవలెను. రాజీయోగ్యములుకాని దావాలనుపట్టకూడదు. ముద్దాయితెరుపునెయత



ని బంధువులో లేకయేజంట్లో అట్లుగాకున్న పోలీసువారో రాజీయోగ్యములు కాని కేసులకుగూడ మధ్యవర్తులను సృష్టించుచుండుటనుభవములోనిదే. ముద్దాయియు నతనిబంధువులు నేరములప్రతిఫలమునెట్లయిన దప్పించుకొన సహజముగ గుతూహలులైయుందురు. తదర్థమై తోచినయూలికెల్ల బ్రాకులాడుదురు. ఇద్దఱికిమధ్యవర్తినే దోషినిజేయునాశయుండును. రాజీయోగ్యముకాని కేసులోజోక్యముకలుగజేసికొనుటే దోషినిశిక్షనుండి తప్పించుయత్నమగును. అందుచేనేరమగును. సామాన్యపుకోర్టులకు పోకపరిష్కారముచేసికొనుటకు సత్యప్రయత్నములుచేసినవారున్నారు. అట్టిరాజీయెంతకాంక్షణీయమయినను ప్రస్తుతచట్టమునకు విరోధము. పోలీసువారుతెచ్చిన సాక్ష్యములో మార్పుసేయుటమంచిదని కొందఱుసూచించుచున్నారు. అట్టియత్నములుకొంతవరకు ఫలించినట్లుతెలియుచున్నది. పార్టీలు పరస్పరము కోర్టుకుపోక వివాదము పరిష్కరించుకొన నంగీకరించిన విషయములలో మధ్యవర్తియొక్కనైతిక లోపమెంతయున్నను, ప్రస్తుతచట్టమునకు మాత్రముగిట్టదు. ముఖ్యముగ ప్రస్తుతపుదండనాథుల (మ్యాజిస్ట్రేట్ల) యొక్కయు వారికుడిభుజమనదగిన పోలీసువారియొక్కయు, నధికారమునకు నష్టముకలుగునప్పుడు తప్పకచట్టవిరుద్ధమగును. ఢిల్లీలో ఒక కేసు మొదటి ఇన్ఫర్మేషన్ రిపోర్టులో, నీవిధముగనున్నది. కూనీ[illegible]గూడిన

యున్నారిజరిగినదని యందులోనున్నది. నిశ్చయమేమనగా నీరు మోయువారు కొందరు కొట్లాడుచుండిరి. కొట్లాడుచుండినవారిసంఖ్యనుబట్టి పినల్ కోడ్‌లోని దొమ్మీశిక్షనువారికన్వయించెను. రోగిగానుండిన యొకముసలివాడు, విడిపింపబోయి కట్టెదెబ్బతిని ఆగాయముచేవాడుచచ్చెను. పశ్చాత్తప్తులైన ప్రతివాదులు మరణించినవానికిబంధువులు కోర్టుకుపోకుండ పరిష్కారముచేయవలసినదనివారు నన్నుకోరిరి. నేనప్పుడున్యాయవాదివృత్తియందుంటిని. నీరుమోయువారి సంఘపుపంచాయతీని సమావేశపరచితిని. దుండగములుచేసినారని ఋజువైనవారు, మరణించినాతనిభార్యకు, పక్షాశనమునిచ్చుట కంగీకరించిరి. ఈమొత్తమునకుపంచాయతీ పెద్దమనుష్యులుపూచీపడిరి. ఈరాజీకి మరణించినవాని భార్యకూడ నంగీకరించెను. అనిదొమ్మీయనికూనీయని ఋజువగుటకు జాలినంతసరియైన సాక్ష్యమురానికారణమున నందఱునీయేర్పాటును మెచ్చుకొనిరి. సాక్ష్యమును సృష్టించుటకు పోలీసువారుచేసిన యత్నములన్నియు వృథయాయెను. అప్పుడు ఆకేసులో నేనువకాల్తుతీసికొనక ప్రత్యేకపంచాయతీదారుగ బనిచేసియుండిన, గొప్పనేరముప్రోత్సాహపఱచినట్లెంచబడి చట్టప్రకారముదోషినైయుందును. నేను మధ్యవర్తిగానుండి పైరాజీని కుదిరించియుండిన, బ్రజలనిందకునర్హుడగాదగిననీతివిరుద్ధకార్యమును జేసినవాడనైయుందును



కానిక్రిమినల్ పంచాయతీకోర్టువారట్టికేసులువిచారణకు దీసికొనకూడదు. ఏలన అట్టికేసులలో జోక్యము కలుగజేసికొనుటవలనమంచికంటె చెడ్డయేయెక్కువ చేయవచ్చును.

పోలీసువారు ప్రతిదినముమహానేరముల బూనద్రొక్కుచున్నారని తెలియును. కానిమనముపోలీసువారి యవినీతినను సరింపగూడదు. అట్టువంటియారోపణలకు గూడమనముతావియగూడదు. ప్రస్తుతప్రభుత్వాధికార మీరూపమున నుండునంతకాలము మనముదానితో యుద్ధమునకుబోరాదు. మనవారిని యెక్కువసత్యవంతులుగ, నిరాడంబరులుగ, శాంతియుతులుగా జేయుటకు, నైతికముగను సాంఘికముగను, బలవంతపెట్టుటకు సర్వప్రయత్నములుసేయవలెను.

(5) చిల్లరవిషయములు అనగా నుత్సవములు,పండుగల వంటి సాంఘికమతవిషయములు మొదలగునవి విని తీర్పుచెప్పుట కింకొకకోర్టుండవలెను.

ఈవివాదములన్నియు మొదలుక్రిమినల్ కోర్టుమధ్యవర్తివినవలెను. స్వల్పవిషయములన్నియునాతడేపరిష్కరించును. విశేషము చిక్కులుకలిగినకేసులకు పంచాయతీసంఘమునంతయు, నన్నికోర్టుల అధ్యక్షులతో సహా సమావేశపఱచవలెను. వారితీర్పులంగీకారమైనచో దానిని ప్రతినిధిమహాసభఆలోచనకుంచవలెను. ప్రస్తుతవిధానముయొక్క యుపరరూపము [illegible]

డవవిధానము నవలంబించిన యెడల, నధికారనిరంకుశత్వముతప్పక వచ్చును. అంతేకాదు. జాతీయపద్ధతులపై ప్రస్తుతనౌకర ప్రభుత్వశాఖలన్నియు, బరిశుద్ధమగు వాతావరణమున బునరుద్భవించును. ఉద్యోగులబాధ్యతలు రెండింతలై విధానముయొక్క చెడుగులు తరలవచ్చును. కాని పెద్దపట్టణములలో మాత్రమే అతిజాగరూకతతో నీవిధానమును బ్రయోగించి పరీక్షింపవచ్చును. గ్రామములో నిరాడంబరములైన పంచాయతీ పద్ధతులనే యనుసరింపవలెను. చట్టనిర్మాణము, శాసనప్రయోగము రెంటిని కలుపుటవలని లాభములనుగాని చెడుగులనుగాని వర్ణించుటకిది కాలముకాదు. స్థలముకాదు.

# మూడవ భాగము.

## శాంతివ్యవస్థలు.

---

నిత్యాభివృద్ధినిగనుచుండు నేసంఘమునకైనను, వ్యవస్థయనునది ప్రాణపదము. ఈవ్యవస్థయే విశ్వభాగములనవిచ్ఛిన్నముగ బంధించునది.

వ్యవస్థకలిగినజనులకు, నడిలేనిజనులకు, శిక్షణనందిన సేనకు నందని సేనకు, భేదమేమనగా, మొదటిది విశదమైనసక్రమమైన పద్ధతిననుసరించి తనధర్మములనెరవేర్చును. ఉద్దేశమునదేమి, కార్యములందేమి, పరస్పరవిరోధముండుటచే రెండవదినులబాధ్య



చేసికొనును. మనలోని యారంభశక్తిచల కాలమునుండి యణచివేయబడినది. సంఘము రక్తహీనమయినది. పాండురోగమునకనుకూలస్థానమైనది. దినదినము గాఢతరమగుచున్న మనమాంద్యతకు నడ్డువేయవలెను. మనలోని యసహాయతాయోగ్యత్వ భావములగలిగించు దుర్వాయువుల బారద్రోలవలెను. ఇకముందుపుటలలో బ్రతిపాదింపబడిన స్వయంపోషకమగు ప్రభుత్వనిర్మాణములో సైనికదళనిర్మాణముకూడ నిమిడియున్నది. ఇమిడియుండుటయేకాదు. ఉండితీరవలయునని కూడ గాంక్షింపబడుచున్నది. రాష్ట్రములోని శాంతి వ్యవస్థలగాపాడుట, వెలుపలనుండి శత్రువులవారించుటకు సరిహద్దుల నింతవరకెవ్వరు రక్షించుచున్నారో వారే రక్షించుచుండవలెను. సువ్యవస్థకలిగి బలవంతమై, పరస్పరసంబంధముగల రాష్ట్రసమవాయము, సుస్థిరముకాని యెడల, హద్దులసంరక్షణమునకై శ్రమపడరాదు. ప్రస్తుతప్రభుత్వముయొక్క జవాబుదారీని దప్పింప నవసరములేదు.

కాని ప్రతిగ్రామమున నంతర్వ్యవస్థనుగాపాడుటకు సైనికదళము నేర్పాటుచేయవలెను, వ్యవస్థాశాఖ నధిష్ఠించియున్న మంత్రి ప్రతిపంచాయతీద్వారనిర్మూలమున సేవకదళనిర్మాణము సేయింపవలెను. ప్రతివాడ కొకనిర్ణీతసంఖ్య స్వచ్ఛందసేవకు (వాలంటీయర్లు) లుండవలెను. 18 మొదలు 45 సంవత్సరముల

లోగా వయస్సుగలిగి దృఢకాయులైన నియోజకులనే (ఓటర్ల
నే) స్వచ్ఛందసేవకులుగ జేర్చి కొనవలెను. వారా ప్రతినిధిమ
హాసభా జీవితకాలముముగియువరకైనను బనిసేయవలెను. ఆస
భాజీవితకాలమునందు సేవచేయుటకు బూనుకొనినవారితోడనే
నిర్ణీతవయస్సుగలిగి యిష్టపడుప్రతినియోజకుడు శిక్షణపొందు
టకు సౌకర్యములను గలుగజేయవలెను. స్వలాభమును సంపూ
ర్ణముగ గుర్తింపగల రాష్ట్రములోని యేవ్యక్తియు, నిర్బంధశి
క్షణమును దప్పించుకొనుటసాధ్యము. సంఘములోని ప్రతివ్య
క్తియొక్క ప్రవర్తనమును నిర్ణయించు నధికారము సంఘమున
కుగలదు. కానియావ్యక్తిని తనయంతఃకరణమునకు విరుద్ధముగ
బ్రవర్తింపుమనరాదు. దేశకాలపాత్రముల నాలోచించినయెడల
యీసూత్రమును మిగులకఠినముగ బ్రయోగింపరాదు. స్వచ్ఛం
దబుద్ధితో శిక్షణమునందునట్లు నియోజకులను బ్రోత్సహింపవ
లెను. ఆత్మగౌరవాత్మాభివృద్ధులు కావలెననినయెడల సైనికశి
క్షణమును (వినయము, మిలిటరీ డిసిప్లిన్) ననుసరింపవలెననుట ని
ర్వివాదము. సైనికశిక్షణముయొక్క ముఖ్యోద్దేశమేమనగా,
సైనికునిమనస్సునకు శిక్షణమొసంగి తానుతనధర్మమునందు ని
ర్భీకుడై, నిశ్చలుడై వర్తించునట్లు జేయుటే. ఏలన, మనవిధానము
న సైనికునికాయుధములతో బనిలేదు. స్వచ్ఛందసైనికుల శిక్ష
ణవిధానభావమునే కలిగింపవలెను. సురక్షితులైన స్వచ్ఛందశాం



తిసైనికులు వంతులప్రకారము సేవచేయవలెను. క్రొత్తమహాసభ
తో క్రొత్తజట్టీపనిబూనవలెను. పరిస్థితులనుకూలించిన నొకజట్టీ
యేయెంతకాలమైన బనిసేయవచ్చును.

ఏతత్కార్యసిద్ధికి బ్రతినిధిమహాసభ స్వచ్ఛందసైనికోప
సంఘము నొకదానినెన్నుకొనవలెను. ఆసంఘమునకు ముగ్గుర
కు దగ్గకుండ పదునొకండుగురకు మించకుండ సభ్యులుండవలె
ను. వారిలోనధికసంఖ్యాకులకు సాధ్యమైనంతవరకు సైనికసం
బంధమైనట్టియు పోలీసుకుసంబంధించినట్టియు బ్రత్యక్షజ్ఞానమో
పరోక్షజ్ఞానమో యుండవలెను. ఏదియెట్లుండినను వారుతమధ
ర్మమునందనురక్తులుగానుండవలెను. శాంతివ్యవస్థల బరిపాలిం
చుమంత్రి యీసంఘమున కధ్యక్షుడుగా నుండవలెను. స్వచ్ఛం
దసేవకుల నిర్మాణమునకు బరిపాలనమునకు నీయుపసంఘము బా
ధ్యతవహింపవలెను.

అధికారములొసగుటకు (కమీషన్) నధ్యక్షునకధికా
రముండవలెను. ప్రతినిధిమహాసభయొక్క యనుగ్రహముననే
యీయధికారముల ననుభవింపవలెను. సైన్యనాయకుడు ప్రతి
యొక్కడీ యధికారములనందియే యుండవలెను. నగరముల
లోనీతనిపదవి యుపనాయకునియోగ్యతకు దగ్గియుండరాదు.
గ్రామభాగములలో వారంట్ ఆఫీసరుగానైన నుండవలెను. క
మీషన్ పదవులనిచ్చుటలో జాల జాగరూకతజూపవలెను.

అనర్హులగువారికి ప్రవేశాదాలియ్యరాదు. కొన్నివిషయములలో బరీక్షింపరాదు. వ్రాతయు జదువుకొంతవచ్చియుండవలెను సైన్యముయొక్కయు పోలీసుయొక్కయు జ్ఞానముండవలెను. తత్ప్రాంతములస్థల జ్ఞానమవసరము. తానునివసించుచువాడల గౌరవమునకు బాత్రుంగజేయు వంశప్రతిష్ఠలుండవలెను. సైన్యములనిర్మాణమునకు, బ్రవర్తనమునకు బ్రత్యేకముగ సంఘముకొన్ని నిబంధనలజేయవలెను. ప్రతినిధిమహాసభవలన కమీషనులుబొందినవారికి బహుమానములు శిక్షలువిధించుపట్లు, సంఘమే సర్వాధికారిగానుండవలెను.

స్వచ్ఛందసైనికులలో దమయుద్యోగులదామే యెన్నుకొనునాచారముకలదు. స్వచ్ఛందబుద్ధితో సేవజేయ నిశ్చయించుకొనినవారా హక్కునుగోరుట సమంజసము, ప్రతినిధిమహాసభ ప్రజాసముదాయమై కాభిప్రాయమును దెల్పుదిశకాన గొప్పతరగతియుద్యోగుల యెనిక లధ్యక్షులన్ని స్వాధీనమున నేయుండవలెను. అల్పోద్యోగులయెన్నికలు, స్వచ్ఛందసైనికోపసంఘముయొక్కయంగీకారమునకులోనై సైన్యనాయకుల యధీనముననుండవలెను.

ప్రభుత్వమువారి సమ్మానసూచకముగ స్వచ్ఛందసైనికులు కొన్నిహక్కులననుభవింపవలెను. మ్యునిసిపల్ కౌన్సిళ్లచేతగాని ప్రతినిధిమహాసభచేతగాని నిర్ణయింపబడు పన్నులు సుంకము



వారికి లేకుండవలెను. మ్యునిసిపిల్ కౌన్సిళ్లవైపునకు బ్రజాభిప్రాయమునుద్రిప్పి యాకార్యమును నెరవేర్చుకొనవలెను. వారిగ్రామములో వైద్యపరీక్షగాని, చికిత్సగాని వారికుచితముగ సమకూరవలెను. వారికింక కొన్నిహక్కులు కూడనుండవలెను. జవానులోనినమురాయ్‌యను సైనికకులమువంటి కులమునొకదానిని గల్పించుటంతతప్పుకాదు. ప్రాచీనకాలమున భారతమాతకు దీనక్షత్రియపుత్రులుండిరి. దేశమునకుమానవజాతికి సేవజేయుటకై వారిపౌరుషమును బ్రకటింపమరల నాజాతిని బ్రతిష్ఠించుటో పునరుద్ధరించుటో చేయవలెను.

సేవకులుమిక్కిలిస్వార్థరహితులుగనుండవలెను. వారియధర్మపరివర్తనమునకు వారినితక్షణమేశిక్షింపవలెను. ఉద్యోగమునుండిచాలించుట, కొన్నాళ్లుకమ్మీచేయుట, బుద్ధిసెప్పుటయివన్నియు బ్రజాభిప్రాయమున మిక్కిలియవమానకరములగునట్లు సేయవలెను. అట్లే, సేవకునికిగల హక్కులు సైనికసంఘముచేతను, ప్రతినిధి మహాసభచేతను నియ్యబడిన హక్కులు బహుమానములు, సంపాదింపదగిన యపూర్వగౌరవములుగ భావింపబడవలెను. 500లుమొదలు 2000లుదనుక నియోజకులుగల ప్రదేశమునకు 25కుతక్కువకాని 100కిమించని సైనికసంఘముండవలెను. ఢిల్లీజనసంఖ్య 1లక్ష.వాడకు4000వేలునియోజకులుందురు. వాడకుఏబదికిదక్కువకాకుండ 2నూర్లకుమించని సైని

ఉండవలెను. సేవకులుసర్వహక్కులు సంపూర్ణముగననుభవించు నాదర్శప్రాయికమగు రాష్ట్రమున నియోజకుల శక్తికిదగినట్లు సేవకసంఖ్యయుండవలెను. ప్రత్యేకపరిస్థితులు కలిగిననేకాని ఢిల్లీకిగరిష్ఠసంఖ్య సేవకులవసరములేదు. ఎందుకనగా, సంపూర్ణహక్కులు కలిగిన 5 వేలసేవకుల బోషించు భారమువహించు శక్తి ఢిల్లీకిగలదనుటకు సాధ్యముకాదు. వేయిగురుసైనికుల నొకగుంపుగా భావించిన, యీక్రిందివిధమునను ద్యోగులుండవలెను

(1) కమాండింగ్ ఆఫీసర్. (స్వహానాలార్)

(2) ఉపసేనాధిపతులు. నాయబ్ సాలార్లు

ఇరువురుకమీషన్ ఉద్యోగులే ?

10 గురు దళనాయకులు ఫౌజుదార్లు. వీరికి వారంట్ఆఫీసర్ల హోదా.

10 గురు దళోపనాయకులు. నాయబ్ ఫౌజ్ దారులు.

100 గురు సేవకులుగలగుంపునకు:—

5 గురు బోధకులు.

10 నాజీములు.

10 గురు నాయబ్ నాజీములు.

సేవకులందఱకు హోదాలహెచ్చింపు లుండవలెను.

(1) పదవియొక్క శ్రేష్ఠతనుబట్టి ప్రతిసంవత్సరము పై పదవికి బంపుచుండవలెను.



(2) శ్రేష్ఠతమమగు పదవినిబొందినవారిని ప్రత్యేకానుగ్రహముకై కౌన్సిల్ వారికి సిఫార్సుచేయవలెను.

(3) గొప్పసేవకాని, కౌన్సిల్ వారిచే నిర్ణయింపబడిన పరీక్షలో తేరుటగాని. ప్రమోషనుకర్హతగా నెంచవలెను.

అంగనిర్మాణమున కౌన్సిల్ భేదముచేయవచ్చును. కాని యది ప్రతినిధిపంచాయతీవారి యంగీకారమునకులోబడి యుండవలెను. సేవకులందరునొకేవిధమగు నుడుపులధరింపవలెను. కనువేంద్రముగ నుండకూడదు. ఖాకీరంగైనబాగు. వివిధోద్యోగులు వివిధములగు గురుతులుధరింపవలెను.

ప్రతిసేవకుడునెలకిరునది కవాతులనైనచేయవలెను. జబ్బుగానున్నపుడు చేయబనిలేదు. కారణములేకయే కవాతుకు రాకపోయిన వానిపేరుతీసివేయవలెను. ఆయుధములులేని సిపాయీలకవాత్, స్కౌటింగ్, ధ్వజచిహ్నములు, పోలీసుపను దలగునవి శిక్షాక్రమమున జేర్పబడవలెను. సైనికోద్యోగులుగా నుండి పెన్షను తీసికొనినవారిని నియోగింపవలెను. సైనికవినయము (డిసిప్లిన్) సంపూర్ణముగ బ్రయోగింపవలెను. మనసేవకులలో రణప్రీతిపుట్టించుటట్లుంచి సైనికులకుసహజమగు వినయభావమును దెగలిగిన మనమెంతో చేసినట్లు. ప్రతి పరిపాలనాసంస్థయు, సర్వమానవకుటుంబనిర్మాణమునకొక సోపానము. ఆకార్యమును ఫలవంతముగ జేయుటకుని శ్రమనుపయోగించినచో

# ౮ వ. భాగము

## విద్య — ద్రవ్యము.

విద్యావిషయమై యనంతమగు వాదప్రతివాదములు జరుగుచున్నవి. బాలునిశీలమును జక్కగనిర్మించియతనిలోనియుత్తమోత్తమగుణములను శక్తులను బహిర్గతముసేయునుద్దేశము లేనిచదువుదండుగ. అంతేకాదు. అట్టిది పాపముకూడ.

ప్రతినిధిమహాసభచేత సక్రమముగ సంపాదింపబడినట్టియు, జనులుధర్మార్థము మనఃపూర్వకముగ నిచ్చినట్టియు, ద్రవ్యసహాయములతో, పరిషత్సంస్థలు, సర్వకళాబోధనశాలలు, విద్యాశాఖకు సంబంధించినమంత్రి నిర్మింపవలెను. ప్రాథమికముగ రాష్ట్రభాషలలో విద్యనేర్పవలెను. ఉన్నతపాఠశాలలలో మాత్రము దేవనాగరలిపియందు వ్రాయబడిన హిందీకాని ఉర్దూకాని నిర్బంధముగ భారతదేశమంతయు వాడుకచేసికొనువరకు నింగ్లీషువాడవలెను. ఇదిభాషాబోధకముగాను, అన్నికళలకు శాస్త్రములకు సంబంధించిన గ్రంథసముదాయము సమకూరునంతకు నింగ్లీషుతక్క వేరొండవమార్గము లేదు. మదరాసునకు, మహమ్మదీయప్రపంచమునకు దేవనాగరలిపినభ్యసించుట కభ్యంతరముండదు. ఇంగ్లీషును మనము మనతాతల లిపిలోనేర్చికొనియుండని [illegible] నని విప్పుడు విధిలేక రెండుభాషల నేర్చుకొను



ను. మనకళలన్నిటికి శాస్త్రములన్నిటికి సంబంధించిన గ్రంథసముదాయము సమకూరినంతనే, మనతర్వాతితరమున విద్యాబోధనమునకు హిందూస్థాని నవలంబించి ఇంగ్లీషునువదలివేయుదము. రాష్ట్రభాషల నుపయోగించెదము. మననాయకులలో చాల మందికి భావోద్రేకతగలిగించి సాహిత్యపరిపూర్ణతగల యాంగ్ల భాషను బహిష్కరించుట గొప్పతప్పు. అఖిలజాతీయసంస్థలలో దినదినముప్రజానురాగమునంది తనయుత్తర్వులశిరసా వహింపజేయుచున్నది దేశీయమహాసభయేకనుక, పాఠపుస్తకనిర్ణయ సంఘము నొకదానినేర్పరచి పాఠనిర్ణయముచేయవలెను. ఇప్పటిక్రమమున చరిత్రబోధనముతప్ప ద్వరలోమారవలసినది లేదు. జనులయున్నతాశయములకుదీటుగ దేశమునందలి విద్యాసరళి యుండవలెను. సంస్కృతమైన యధునాతన విద్యావిధానమున నుసరించి పాఠశాలలు మక్తబులు పునరుజ్జీవితములైనచో విద్య యేలనెక్కువచౌకయై యుపయోగకరమైనదికాకూడదు? నీచమై దీనమైన బానిసవృత్తి నవలంబించి దాసులుదాసులుగాబడి యుండు, గాకితపుగట్టలమధ్య నూపిరిపుచ్చుకొనువ్యవధిలేక రాత్రింబవళ్లు దాస్యముచేయుటకుమారు ఆత్మాభిమానముగలిగి ప్రజలుస్వాధారులగుదురు.

## ద్రవ్యము.

మానవులకుచెందిన ప్రతిసంస్థయందును దానిభాగము

లోపటికి పరస్పరమునైతికార్థిక సంబంధముండవలెను. మనరాజ్యాంగనిర్మాణము అచ్చమునైతికశక్తులయాధారమున నిలువవలెను. అందులో ఆర్థికలాభవివేచనము తొలగించితిమి. కాని మనజాతియొక్క ప్రస్తుతస్థితియందాదర్శక పరిస్థితులూహ్యములుమాత్రమై నిశ్చయములుకానప్పుడు, సంస్థాపించిన్న తకలుగక రక్షింపబడవలయునన్న నార్థికసంబంధమును సంపూర్ణముగనుపేక్షింపజాలము. ప్రచారమునకేమి, శాశ్వతోపయోగములకేమి, మఱి యితరావసరములకేమి, ద్రవ్యముకావలసియున్నది. ప్రజలలో ప్రతియొక్కడు సేవకుడుగనుండవలయునని యే సిద్ధాంతమైనను, జనులలో ద్రవ్య మసమముగ విభజితమైయున్నదిగను సేవకులలో నధికసంఖ్యాకులుకూడు లేక యల్లాడవలసియున్నారు.

పంచాయతీకి ధనసహాయముచేయుటకు, పంచాయతీకోశమును నిర్మింపవలెను. నిర్మింపబడిన వివిధశాఖలు పోషింపబడవలెను. ఈసిద్ధాంతమును బాహాటముగ నంగీకరింపకపోయినను నిరుపేదలకు సేవకులయక్కర బూడ్చవలెను. ఇప్పటికొన్ని గ్రామములలో వమవనిబాటలవారిని ధాన్యరూపమున నేదో గొంతయిచ్చి పోషింపవలెను. గుమాస్తాలుమొదలగువారి విషయమునగూడ నిట్లే సామాన్యమగు వాక్కులుచాలకపోయిన ద్రవ్యసహాయము నేర్పాటుచేయవలెను. రాష్ట్రము



దలిబలహీనులకు, అంగవైకల్యమున శక్తిహీనులైనవారికి, పంచాయతీనిధి పోషకముగావలెను. మఱి అన్నసత్రము నేర్పాటుచేయవలెను. రాష్ట్రములోని ప్రజలలో నొక్కడుకూడ దంకు గతించితినువాడు కాకూడదు. తనజీవనమునకొఱకు ప్రతియొక్కడు బనిచేయవలెను. దృఢకాయులగు బీదలకక్కటపనియోగించుకొను నేర్పాటుచేయుటయందార్థిక శాఖామాత్రిశ్రద్ధాళువు కావలెను. చేతివర్గములకూటములుకాని, సులభముగనేర్పడగిన యితరపరిశ్రమల కూటములుకాని, ప్రతిగ్రామముననుబట్టణమునను దృఢకాయుల వినియోగించుటకై యేర్పాటుచేయవలెను. భిక్షాటనమనుచెడుగును రూపుమాపునట్లు ప్రజాభిప్రాయమును ప్రబోధింపవలెను.

మంత్రి ద్రవ్యమెట్లు యెచ్చటనుండి రావలెను? గ్రామము నంతయు మనమీవరకే వాడలుగావిభజించితిమి. వాడవాడను వారివారివృత్తులననుసరించి సంఘములుగా విభజించితిమి. ప్రతి సంఘమునకు బంచాయతీకలదు. దానికిఅధ్యక్షుడుండవలెను. అట్టిపంచాయతీకి చందా మొదటియాదాయము. పన్నులుసుంకములు నసహ్యకరములైనవి. స్వచ్ఛందజన్ములకాభావమే ధేయమైనది. ఫ్రాన్సుదేశమున బన్నులకు కంట్రిబ్యూషనులని ఇచ్చువారుకంట్రబ్యూటర్స్ అనబడుదురు. అనగా బరిపాలించుటకువలసిన ద్రవ్యమునిచ్చువారు. అనగా దాతల

రహిందూస్థానములో దీనినే ధాలాయందురు. ప్రతినిధిమహాసభ రాజ్యాంగముయొక్క సంవత్సరపు ఖర్చుల సంచనా వేయవలెను. ధాలాలేక చందా ప్రతిసంవత్సరము మంజూరు చేయవలెను. దానియంత్రిలువసూలు చేయవలెను. ఉపపంచాయతీలమూలమున నీకార్యము సేయవలెను. వానికిసంబంధించని వ్యక్తులతో ప్రత్యేకము సంపాదింపవలెను. ఇదిముఖ్యాదాయము. నేరములుచేసిన వారినుండి వచ్చు జరీమానాలు, కోర్టుఫీజులు, బుద్ధిపూర్వకము గనిచ్చినదానములు, పంచాయతీపోష్టులమూలమున వచ్చునాదాయము యివిముఖ్యములు.

పంచాయతీసభవారిచే నియమింపబడినకోర్టులు, కోర్టుఫీజులను, స్టాంపుఫీజులను నిర్ణయించుకొనవచ్చును. అభియోగమూల్యము రు1000లకు మించనివానిలో కోర్టుఫీజుఉండనేరాదు. రు1000—లకు మించినయభియోగములలో నిప్పుడువిధింపబడు ఫీజులో నైదవవంతు నిర్ణయింపవచ్చును. ప్రజలనుపంచాయతీకోర్టులలో దమపాక్షికులసామరస్యము గుదిరించుకొనునట్లు ప్రోత్సహించుటకును, బీదవారలకు వ్యాజ్యములలో గలుగుదుర్వ్యయనష్టముతగ్గించుటకు, నీయేర్పాటు చేయబడవలెను. పద్ధతియందు దోషములేకపోలేదు. ప్రారంభమున లోపములుండినను క్షమార్హములు.

గ్రామావసరముల కొరకుపంచాయతీ పోస్టుశాఖ స్థాపిం



పవలెను. రైల్వేపద్ధతి యెట్లొక్కని తాతలసొమ్ముకాదో యట్లే యుత్తరములు పార్సెళ్లు నొకరినొకరి కందింపజేయు తపాలా పద్ధతి యే వ్యక్తిస్వత్వముకాదు. మనదేశమునందలి ధనికులీవిషయమై యిన్నాళ్లవరకుపేక్షవహించియుండుటాశ్చర్యకరము. ఇతర యూరోపీయ దేశములలో గవర్నమెంటువారి పోస్టుశాఖతోగూడ వర్తక సంఘములు నిర్వహించు తపాలాశాఖలు, టెలిఫోను శాఖలు గలవు. మనప్రస్తుత పరిస్థితులలో సర్వము ప్రతినిధి మహాసభచేతనే చేయింపవలెను. సేవకులసహాయముతో నడచు, తపాలాశాఖను బ్రతిగ్రామమందు కేర్పాటు చేసికొనగూడదో తోచుటలేదు. అదియొకముఖ్యాదాయమగును.

పంచాయతీ పరిశ్రమల సువ్యవస్థితముచేసి, పారిశ్రామికులనియమించి, యాదాయమును వారికి బంచాయతీవారికి ననుచితరీతిని బంచిపెట్టి పంచాయతీకి మఱింత యాదాయముకల్పింపవచ్చును.

గ్రామములలో సహకార సంఘములను వ్యవసాయమును బెంపొందించి, సంపదనభివృద్ధిచేసి గ్రామాదాయమునకు దోడ్పడవచ్చును.



*ALL RIGHTS RESERVED*

PRINTED AT THE REDDY PRESS TADPATRI

PUBLISHED BY LAKSHMI STORES TADPATRI

1925- 1000

## పరమసాత్త్వికతత్త్వ కందార్థశతకము.

వేదాంతసార సర్వస్వమంతయు ముద్దులొలుకు కందరూపమున వ్రాయఁబడినది. ఇందు గురుశిష్యప్రకారమును సగుణనిర్గుణ భావంబులును, ప్రత్యగాత్మవివరణమును బ్రహ్మైక్యానుసంధానవిధానమును నను బ్రహ్మవిద్యారహస్యము లనేకములు కరతలామలకప్రాయముగ వెల్లడిచేయఁబడియున్నవి. శ్రీమాన్ కలచవీడు వెంకటరమణాచార్యులుగారిచే సంపాదితము. వెల. 0—3—0

## కృష్ణవేణి.

గ్రంథకర్త: కలచవీడు వెంకటరమణాచార్యులు.

బ్రహ్మశ్రీ కవిసింహ శతావధాని డి. రాజశేఖరకవిగారీ పుస్తకమునకుఁ బీఠిక వ్రాసియున్నారు. ఇదియొక చిన్న పద్యకావ్యము. నాయికానాయకులగు కృష్ణవేణీ శంకరులకథ యిందలి ముఖ్యాంశము. వీరా బాల్యప్రవర్ధమాన శుద్ధప్రణయ బద్ధ మృదు హృదయులు. ఇట్టివీరికి వరశుల్కాపేక్షచేఁ గథానాయకుఁడగు శంకరుని తండ్రి కలిగించిన కష్టములును కుమారుఁడు వరశుల్కమను సాంఘిక కళంకమును తొలగింపఁ జేసిన యత్నములు చక్కఁగ వర్ణింపఁబడినవి. పత్రికారాజము ములు మిక్కిలి కొనియాడినవి. వెల. 0—6—

# సీతాకల్యాణము

(౫ అంకముల నాటకము.)

గ్రంథకర్త కవిసింహ డి. రాజశేఖర శతావధానిగారు.

బాలసరస్వతీ, కావ్యతీర్థ, అభినవ వాల్మీక్యాది బహుళ బిరుదాంచితులగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రి శర్మగారీ నాటకమున కుపోద్ఘాతమును వ్రాసియున్నారు.

శ్రీరామజననము మొదలు సీతాకల్యాణమువఱకుఁగల కథ యిందు రమ్యముగఁ బొందుపఱుపఁబడియున్నది. ప్రథమాంకమున విష్ణునితో దేవతలు మొఱపెట్టుకొనుటయు, ద్వితీయాంకమున దశరథ విశ్వామిత్ర సంవాదమును తృతీయాంకమున విశ్వామిత్ర చరిత్రమును, చతుర్థాంకమున స్వయంవరమును, పంచమాంకమున దశరథరామ భార్గవరాము సమావేశ సంవాదములును మిక్కిలి రుచిమంతముగనుండును. పరశురామశ్రీయరాముల సమావేశాదులు నూతన విధానములతో నడుపఁబడి మిక్కిలి హృద్యంబుగను నానందకరముగ నుండును శైలి శ్రేష్ఠము. వచనములును, పద్యములును రసపూర్ణములు. భావములు హృదయంగమములు. రామాయణమును దెలియఁగోరు వారందఱును దప్పకచదువఁదగినది. వెల 0—8—0

జనోపకారిణీస్టోర్సు, ప్రొద్దు

